# ఆ ము ఖ ము

ప్రవాసాంధ్రులలో విజ్ఞానజిజ్ఞాస, భాషాభిమానము, పెంపొందింపజేసే ఉద్దేశముతో నెలకొల్పబడిన మా ప్రచురణలలో తృతీయపుష్పముగా 'సంధ్యాగీతము' ను పాఠకలోకానికి అందించుచున్న రచయిత శ్రీ వజ్ఝల వేంకటేశ్వరకవిగారికి మేము కృతజ్ఞులము.

అధునాతనాంధ్రసాహిత్యరంగములో ప్రత్యేకము, సముజ్వలము అయిన ఒక విశిష్టస్థానము 'సంధ్యాగీత' కృతికర్తకు ఉన్నది. వీరి 'అమరవీణ' తెలుగుభాషాసమితిద్వారా ఆంధ్రప్రభుత్వ బహుమతి నందుకొన్న మనోహర గేయ కావ్యము. 'సంధ్యాగీతము' భావబంధురమైన పద్యకావ్యము. డాక్టర్ యస్వీ జోగారావుగారు తమ 'పరిచయము' లో 'సంధ్యాగీతము' లోని సువర్ణసౌంద ర్యము నిరూపించియున్నారు.

ఈ సందర్భములో తే 17-5-59 దీని జమ్‌షెడ్‌పురములో అత్యంతవైభవో పేతముగా జరిగిన 'సంధ్యాగీత' కృతికన్యాదానమహోత్సవము గూర్చి దిఙ్మా త్రముగా తెలుప వేడుకపడుచున్నాము. కృతిభర్త శ్రీయుత భాగవతుల విశ్వనా థంగారు జమ్‌షెడ్‌పూ రాంధ్రప్రముఖులలో ఒకరు ; వీరు టాటానగర్-ఫౌండ్రీలో ఉన్నతోద్యోగులు మాత్రమే కాక స్థానిక - ఆంధ్రనాటకసాహిత్య సంఘమునకు ఉపాధ్యక్షులుగా కూడ ఉండిన కళాభిమానులు. కృతికర్తకు, కృతిభర్తకు సన్నిహితబంధువులైన శ్రీ వజ్ఝల సంగమేశ్వరరావుగారు సభాధ్యక్షులై కృతి - వధూవివాహమునకు పౌరోహిత్యము వహించగా నాటి కార్యక్రమము వేదోక్తాశీర్వా దములతో ప్రారంభమైనది. కవిగారు కృతిప్రదాన పద్యావళి వినిపించి కృతిపతిని, వారి సతీమణిని వస్త్రమాల్యాదులతో గౌరవించి 'సాలంకృత కృతికన్యాదాన' మొనర్చినారు. కృతిభర్త కృతిస్వీకారము చేసి కర్పూరహార చీనాంబరాభరణ చందనతాంబూలాదు లర్పించి, కృతికర్తను, వారి సతీమణిని సన్మానించి, కవి గారిని సముచితరీతిని సత్కరించినారు. కవిగారు తమకావ్యములోని కొన్ని ఘట్టములను చదివి శ్రోతృశ్రవణపర్వముగా వినిపించినారు. సభ నలంకరించిన

బంధు                    బు హర్షధ్వానములు చేసినారు. శ్రీ వఝ్ఝల కాళిదాస కవిగారు కావ్యరచనలోని విశిష్టతనుగురించి ఉపన్యసించినారు. ప్రాచీనసంప్రదాయముతో నవ్యత మేళవించి జమ్‌షెడ్‌పురములో జరిగిన మొట్టమొదటి కృతి ప్రదానోత్సవ మిది యగుట ఒక ప్రత్యేకవిశేషము.

ఆంధ్రపాఠకలోక మీ కృతిని సమాదరింతు రని, మా సమితి పురోగతికి తోడ్పడుదు రని మా అచంచలవిశ్వాసము.

అక్టోబరు 15,
1959.

భవదీయులు
ఆంధ్ర విజ్ఞాన సమితి

# ఒక మాట

విశ్వకవి రవీంద్రుని కచదేవయానీ-రూపకము ఆధారముగా, పాతిక సంవత్సరాలక్రింకట పాతికేండ్ల వయస్సున్న నాచే రచింపబడిన యీ 'సంధ్యాగీతము' ప్రచురించబడు భాగ్యము నేటికి గాని లభించలేదు. గతించిన పాతికేండ్లలో అప్పుడప్పుడు వ్రాయబడిన ఖండకృతులు కూడ ఒకకొన్ని యీ గ్రంథములో చేర్చబడినవి.

నా యీ కృతిని స్వీకరించి దీనిప్రచురణకు తోడ్పడిన శ్రీ భాగవతుల విశ్వనాథం గారికిని, దీనికి 'పరిచయము' వ్రాసిన డాక్టర్ యస్వీ జోగారావుగారికిని, దీనిని తమ మూడవపుష్పముగా గ్రహించిన ఆంధ్ర విజ్ఞాన సమితివారికిని కృతజ్ఞతాపూర్వక ధన్యవాదము లర్పించి, యీ కావ్య సంచయమును ఆంధ్రప్రజానీకము హస్తకమలములందు ఉంచుచున్నాను.

ఈ గ్రంథమును సర్వాంగ సుందరముగాను, నిర్దుష్టముగాను ముద్రించి సకాలములో అందజేసిన సరస్వతీ పవర్ ప్రెస్ అధిపతులు శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావుగారికి నాధన్యవాదములు.

జయపురం,
1-11-960

రచయిత

# రచయితను గురించి

పేరు: వజ్ఝల వేంకటేశ్వర్లు

తండ్రి: స్వర్గత బుచ్చికవి, బహుళప్రబంధకర్త.

తల్లి: స్వర్గత వేంకటలక్ష్మీచెల్లమ్మ.

జననము: 1908 అక్టోబరు 1 వ తేది.

జన్మస్థలము: బొబ్బిలి.

స్వగ్రామము: పాలతేరు, శ్రీకాకుళం జిల్లా.

విద్యాభ్యాసం: బొబ్బిలి, విజయనగరం, రాజమండ్రి.

విద్యా – పట్టములు: బి. ఎ. (విజ్ఞానము), బి. యిడి.

వృత్తి: ఉపాధ్యాయత్వము.

అభిమాన విద్యలు: ఆంధ్ర – సంస్కృత – ఆంగ్ల – ఉత్కళ – భాషా సాహిత్య వ్యాసంగము, ఆంధ్ర – ఉత్కళ కావ్య రచన.

రచనలు:
1. 'నౌకాభంగము', పద్యకావ్యము. రచన, ప్రచురణ, 1933.
2. 'అమరవీణ', గేయకావ్యము. రచన 1947, ప్రచురణ 1958.
3. 'సంధ్యాగీతము', పద్యకావ్యము, రచన 1934, ప్రచురణ 1960.
4. 'కమలావిలాసము', శృంగారప్రబంధము. రచన 1924, ప్రచురణ 1936.
5. 'నౌకాభంగ', ఉత్కళపద్యకావ్యము. రచన 1943, ప్రచురణ 1953.
6. 'మాతృవందనము', పద్యమాలికా కావ్యము. రచన 1938. అముద్రితము.
7. 'నీరాజనము', ఖండకావ్యసంపుటి. అముద్రితము.
8. 'ఆంధ్రవ్యాకరణసంస్కరణము' వ్యాసావళి. అముద్రితము.
9. 'క్రొత్త తెలుగు వ్యాకరణము.' అముద్రితము.

చిరునామా. భూపతివీథి, జయపురం,
కొరాపుట్ జిల్లా, ఒరిస్సా.



కృతికర్త :

శ్రీ వజ్ఝల వేంకటేశ్వర్లు

# ప రి చ య ము

## డాక్టర్ యస్వీ జోగారావు, ఎమ్. ఏ., పిహెచ్. డి.,

ఆంధ్రోపన్యాసకుడు. ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, వాల్తేరు.

ఇది చిత్రమైన కాలము. కళారంగమునందును కుల మత రాజకీయాది విభేదములు యథేచ్ఛగా పాటింపబడుచున్న కాలము. నాగరికత మితిమీరి నంగనాచి నయగారములు, నభినయములును ప్రబలిపోయిన కాలము. మందబుద్ధులును మంది సుద్దత్తువల్ల మహాకవులుగా చలామణి యగుచున్న కాలము. అసలైనమహాకవులు వసంతవిరహమున రుద్ధకంఠము లైన కలకంఠములవలె మరుగుపడిన కాలము. ఇట్టి యీ కాలమున ఓఢ్రదేశమున తెలుగున కవిత్వము చెప్పుయోగము పట్టినవారిలో శ్రీ వజ్ఝల వేంకటేశ్వరకవిగా రొకరు.

రమారమి పాతికేండ్ల క్రిందట కతిపయాబ్దములు వేంకటకాళిదాసకవు లను జంటకవులు శ్రుతిలయలుగా 'భారతి' బహువారములు క్రమకవితాగానము నాలపించినది. ఆ దంటకవుల జంటలోని వేంకటేశ్వరకవిగారే వీరు. తదుపరి ప్రత్యేకముగను వీరు కొన్ని ప్రౌఢకావ్యములను పరిథవించిరి. అందు మొదటిది 'నౌకాభంగము', ముద్రితము. ఇది వారిచేతనే ఓఢ్రభాషలోని కనూదితమై ప్రచురితమై ఉత్కళ కవి పండిత ప్రకాండులచే బహుధా శ్లాఘింపబడినది. తెలుగు నౌకాభంగమునకు రాదగినంత ప్రతిష్ఠ రాలేదు. కారణము తెలుగు వారికి గల సవర్ణవ్యత్యయబుద్ధి యనుకొందును. ఇటీవల ప్రకటిత మైనది వీరి 'అమరవీణ'. ఇది 1954 – 55 సంవత్సరములో తెలుగు భాషాసమితి జరిపిన కావ్యముల పోటీలో ప్రథమ బహుమానము నందినది. తెలుగులో నిది యొక అపురూపమైన నిబద్ధగేయకావ్యము. ఆంధ్ర కవితా సరస్వతి విపంచి కనేక శుభశ్రుతు లొనగూర్చిన వీరిపు డా దేవి కొక వీణనే కానుకవెట్టిరి అదే అమరవీణ – ఆ సరస్వతీపురస్కారపుణ్యఫలము లగు తీర్థప్రసాదములు సంగీతసాహిత్యములు రెండును సమపాళముగా కలిసివచ్చిన మధురకావ్యరాజ మది.

ఇక ప్రకృత మీ సంధ్యాగీత మిది యొక వింత సంతన. ఇందు మొదటి భాగము ప్రసిద్ధమైన కచదేవయానుల కథ యితివృత్తముగా గల కబ్బపుగున్న,

ఇది యిప్పటికి పాతికేండ్లపూర్వము, అనగా కవియొక్క ప్రథమావతీర్ణ యౌవన దశలో మధురశబ్ద ప్రౌఢభావ దృఢపరిష్వంగములో కులికిన యొక కబ్బపుగలికి.

ఒక సన్నివేశమున భిన్నలక్ష్యములు ప్రదర్శించిన రెండుపాత్రములయెడ సమానముగా సానుభూతి వహించుట సామాన్యపాఠకునికి కష్టసాధ్యమైన విషయము. కాని యొక సహృదయున కా సానుభూతి సమన్వయము నతిసమంజసముగా కుదుర్పగల సన్నివేశము లుండుట యన్నది అసహజము కాదు. అట్టి సన్నివేశములలో కచదేవయానుల సమావేశ మొకటి. కచుడు దేవకోటిప్రార్థనపై తత్ప్రాణత్రాణపరాయణుడై మృతసంజీవనీ విద్యాభ్యాసార్థము శుక్రునికడకు వచ్చినాడు. శుక్రసుత దేవయాని అతనిని మనసార ప్రేమించినది. కచుడు రక్కసులవలన పలుయిక్కట్లకు లోనయ్యు ఆమె ప్రేమ యండగా చివరికి మృతసంజీవని సాధించినాడు. తోడన స్వర్గమునకు ప్రయాణము కట్టినాడు. దేవయాని ప్రాధేయపడినది. లాభము లేకపోయినది. అట్లు కచు డక్కడ శుక్రాశ్రమములో తన మనుగడ యంతయు నొక చక్కని యభినయముగా గడపి, తన వచ్చినపని నెరవేరినంత దేవయాని పవిత్రప్రణయమును తృణీకరించిపోయినా డనగనే సాధారణముగ సహృదయుడైన పాఠకునికే ప్రతివానికిని పరిదేవనమున గూరిన దేవయానియెడ సానుభూతియు, కచునియెడ నేవము, కోపమును గూడ పొడసూపును. కాని మరియించుక ఉదారుడైన సహృదయునకు వెంటనే దైవకార్యమును మహత్తరముగా నెంచి తన్నిమిత్తము పలుబాములకు లోనై స్వార్థత్యాగము చేసిన-మహానుభావు డతని తితిక్ష, కార్యదీక్ష, ఉదాత్తలక్ష్యప్రవణత్వము, స్వసుఖవిముఖత్వము మున్నగు గుణగణములు స్ఫురించి అతనియెడ సానుభూతి పొటమరింపక పోదు. మధురప్రణయరసనిర్భరమైన మదుక్షణముననే హృదయపాత్ర చిదికి చిద్రుపలై వాపోవు దేవయానితోడి సానుభూతియు నా సహృదయుని హృదయమున అప్రక్క నట్లే యుండగలదు. ఇది యొక సున్నితమైన సన్నివేశము.

ప్రపంచమున నించుమించు ప్రతివాఙ్మయమునందును ఉత్తమకవితగా పరిగణింపబడుచున్న పదార్థమునందు మూడువంతుల ముప్పాతిక శృంగారప్రధానమైనదే. అందు మరియు నుత్తమమైనదిగా పరిగణింపబడునది యొక లోకోత్తర ప్రయోజనార్థము బలియైపోయిన పరిమితవ్యక్తిక — ప్రణయానుబంధము లితి

వృత్తముగా గలది. కచదేవయానుల కథ యిందులకును లక్ష్యభూతముగా నిలువ గలదు.

ఈ కథకు ప్రధానాకరము మహాభారతము. మహాకవి రవీంద్రుడు నీకథ యితి వృత్తముగా నొక రమ్యమైన రూపకమును రచించియున్నారు. అది కొంత యాధా రముగా నీ పద్యకావ్యమును సంతరించినారు శ్రీ వేంకటేశ్వరకవిగారు.

ఇందు తొలిసంజ, మలిసంజ యను రెండు పాయలు గలవు. తొలిసంజ యంతయును, మలిసంజలో తొలిపాలును భారతమందలి కథ నిమిత్తమాత్రముగ సాగిన కవిగారి స్వతంత్రరచన. మలిసంజ రెండవపాలు రవీంద్ర రూపకానువా దము. తొలిసంజలో రచన శ్రవ్యకావ్యధోరణిలో సాగినది. మలిసంజలో నాట కీయమైన వాకోవాక్యశైలి పాటింపబడినది. తొలిసంజలో ప్రధానవిషయము శుక్రా శ్రమముకడ కచదేవయానుల సమావేశము; మలిసంజలో మృతసంజీవని సాధించి స్వర్గమనోన్ముఖుడైన కచునితో దేవయాని సంవాదము. అమధ్య నధ్యాహార్యములు కచుని కష్టపాట్లు, శుక్రుని విద్యాదాన సందర్భము మున్నగు ఘట్టములు. తొలి సంజలో కచునియెడ దేవయానికి తొలిచూపులో వలపు తొలకరించినది. మలిసం జలో కచవియోగము, దేవయాని నిర్వేదము. సంధ్య యనగా రెండు భిన్నలక్షణ ములు కల కాలభాగముల ననుసంధించు ఆ నడిమి సమయము. అనగా ఒక నిర్దిష్టలక్షణము కల కాలము మరియొక విలక్షణమైన కాలముగా పరిణమించు నట్టి ముహూర్తము. తొలిసంజ యనగా ప్రాతస్సంధ్య. ఆ సమయము లోకము నకు వేకువ. ప్రస్తుతకథలో కచునిరాక ఎలజవ్వని యగు దేవయాని యెదలో తొలివలపుపాటకు పల్లవి. మలిసంజ యనగా సాయంసంధ్య. పగలు గడచి రాత్రి — వెలుగు పోక, చీకటి రాక, అనగా ప్రస్తుతకథలో కచుని స్వర్గమనోద్య మము, దేవయాని నైరాశ్యము. రెండు సంజలును రాగమయములే కాని యా రాగపరిణామక్రమములు వేరు. కథలో నాకడల దేవయాని పరిస్థితి యట్టిది, సరిగా ఆయా సంధ్యారాగ పరిణామక్రమసన్నిభము. ఆమె ప్రేమగీతికి పల్లవి పునశ్చరణ లేదు, రాగాలాపన మరి జరుగనే లేదు. కావ్యమునకు సంధ్యాగీత మను పే రెంతయు చక్కగ కుదిరియున్నది.

దేవయాని కడమ సామాన్యకావ్యనాయికలవంటిది కాదు, ఆమె దొక ఉజ్జ్వల పాత్రము; ప్రణయమునందును రాజసప్రవృత్తి సమృద్ధిగా గలది. అందుల

కామె రక్షోగురుని కూరిమిపుత్రి యగుటయే కాదు కారణము, కచుని నిరాకరణమును. అది యామె జీవితవైఖరినే మార్చివైచినది. తొలిసారి మనసార వలచిన వలపు విఫలమై గాసిచెందిన ముగ్ధహృదయము మరి ముగ్గకుండగనే ముదురు వారును. పాప, మట్లయినది దేవయాని పరిస్థితి. ఒకవిధమైన సున్నితమైన మనస్తత్వము గల కవుల చూపునకు మాత్రమే అందునట్టి దా పాత్ర అంతర్యము. మహాకవి రవీంద్రున కట్టి మానినీహృదయమర్మములు సమ్యగధిగతార్థములు. అతడు పౌరాణిక గాథా ప్రపంచమునుండి స్త్రీపాత్రల నేరికొని తీర్చిన తీర్పు జూచినచో నీ విషయము విశదము కాగలదు. దేవయాని రూపకమునందును అయన అభినివేశ మట్టిదే. అయన యెత్తుకొన్న దామె ప్రణయజీవితమున మలినంజ ఘట్టము మాత్రమే. అందును భారతమునందువలె నాయికానాయకుల శాపప్రతిశాపములకు కాదు ప్రాధాన్యము; విధి నియోగ వియోగ విధురము లగు వారి హృదయములందలి వేదనాశ్రుతి స్పందనములకు.

కచుడు, చిట్టచివరి వీడుకోలు వేడికోలుగా ;

'.... సౌందర్యోపాసన చేయరాని దగుచో, జ్ఞానమ్ము నార్జింప దుష్కార్య మ్మౌనెడ, సత్యసాధనము దోసమ్మేని, మన్మానసాంతర్యు క్త ప్రణయమ్ము తప్పయిన నింతన్ గంటి శిక్షావిధిన్.

'.... శాశ్వతమ్ముగా తీరని ప్రేమ నా మది గదింపుచు నా కిక స్వర్గసీమ కానేరని స్వర్గసీమగన నే పయన మ్మొనరింపగాదగున్.

'చిరకష్టానుభవోపలబ్ధ మృతసంజీవన్యభిజ్ఞాన మే
నెరిగింపన్వలె దేవతావళికి, తన్వీ, నాదుసౌఖ్యంబులన్
పరిశీలింపక మున్న ; మద్వికలితాత్మ క్లేశిత త్వన్మనోం
తరబాధా ద్విగుణీకృతవ్యథుడ నౌ నన్నున్ క్షమింపంగదే.'

అని వక్కాణించినాడు. ఇం దత డుత్తమప్రేమికుడుగా, ఉదాత్తధర్మప్రవణుడుగా, స్వార్థత్యాగిగా నిరూపింపబడినాడు. ఆపాత్ర యోగ్యత కది పరమావధి. (భారత

మున గురుపుత్రి 'సహోదరి' యను నింకొక ధర్మసూక్ష్మము పరమరమణీయముగా ప్రతిపాదింపబడినది.)

దేవయాని సమాధానము :

'ఏమి, క్షమార్పణమ్మొ ! భరియింపగరాని క్రుధాగ్నికీలికా
స్తోమము మేలుకొల్పితివి, ధూర్తుడ ! నాహృదయమ్ములోన, నీ
కేమి, భవత్పురంబునకు నేగి యశమ్ము గడించుకొందు, వీ
కామిని కేమి యున్న దిక కాంక్షలు జారెన జీవితమ్మునన్.

'అలరు లొలయించు వలపులే అలముకొనిన
తలపు కంటకతల్పమై కలగు నేడు ;
నా రహస్యలజ్జావమానములు వ్యథలు
గూర్చ జీవితమూలమ్ము గొరుకు నింక.

ప్రాయపుటెండ సోకునెడ పాంథునికై వడి వచ్చి నా వన
చ్ఛాయల నిల్చి, కాలహృతి సల్పగ పూవులనెల్ల కోసి నీ
వీయెడ దండ యల్లితివి ; ఏగుచు నిప్డు తదీయసూత్ర, మ
య్యో ! యెడలించి త్రెంచెదుగదోయి, సుమమ్ములు ధూళి రాలగన్.'

అని కటకంబడి చివరికి —

'ప్రణయిమాధుర్యభావలవమ్మె నీదు
జీవితమునకు దూర మైపోవుగాక.'

అని ప్రకృతార్థసంవాదిగా తన కోపమును శాపముగా తెగించి తెనిగించినది. ఆ పంక్తులతో ఆ ప్రణయజీవితసమాప్తియు, నీగ్రంథపరిసమాప్తియు నగుచున్నవి. ఇచట ప్రణయతత్త్వఖునకు మొగ్గుసూపు కవిహృదయమునందలి కావ్య

నీతి ఖంగున మ్రోగినది. రెండు పాత్రలును సహృదయపాఠకుని సానుభూతిని సమానముగా చూరగొనుచున్నవి. ఇంత రమణీయమైన రవీంద్రుని రూపకసన్ని వేశమును స్వతంత్రరచనగనే భాసిల్లునట్లు బావానుగుణపదబంధసుందరముగా తెనుగునొ దేర్చ్పిటయ కాదు, అభాగమునందే అచ్చముగా స్వకీయభావనావిలసితము లగు పద్యములు నొకకొన్ని హవణించినారు కవిగారు. అవి, ' తమకపు పారవశ్య మెడదన్ .... ', ' ప్రియసఖ, యేనొకర్తు .... ' ' ఇంత విశాల మీగగన .... ' ' అ తొలిసంజలో వెలుగులై .... ' అనునవి.

ఇక కేవలము కవిగారి స్వకపోలకల్పితము లగు తొలిసంజను, మలిసంజలోని తొలిపాలును కొంత పరిశీలింతము. రవీంద్రుని రూపకేతివృత్తము కచదేవయానుల ప్రణయకథలోని చరమసన్నివేశము కాగా, దాని కిది యంతయు పూర్వరంగము. ఇది యా రూపకప్రతిపాదితమైన వారి ప్రణయపరిణామమును క్రమోన్మీలితము చేయునట్లుగా రవీంద్రు డాశించిన కథాప్రధానప్రయోజనమున కున్ముఖముగా సాగిపోయినది. అనవసరవిశేషములు, నధికప్రసంగములును లేక విషయచాలనము, విపులవర్ణనాచాపలము లేక వస్తువుకంటె భావతత్త్వము ప్రముఖమై యొక చక్కని వాతావరణము కల్పింపబడినది. రవీంద్రుని సన్నివేశసౌధము నధిరోహించుటకు మన కవిగారు నిర్మించిన సోపానసరణి ఎంతచక్కని దని చెప్పను ! చూడుడు :

' ప్రథమాగత స్నేహరస మహావేశమౌ
గాలిమొత్తపు కెరటాల యుబుకు ;
వ్రీడానమాశ్లిష్ట దృక్స్మితప్రేమమౌ
మొయిలులో తొలిచుక్క ముద్దువెలుగు ;
చిరహృదంతరబద్ధ నిరుపమ ప్రణయమౌ
పరువంపుమొగ్గల విరియు వలపు ;
విరహాతిరేక విస్ఫురితానురాగమౌ
పడమటి రాగసంపదల సొగసు ;

ప్రియతిరస్కార విదళిత హృదయ శోక
రస మగు, ధునీప్రవాహతరంగశీక
రాశ్రుసేచన; మచటి దినావసాన
కాలము విషాదశృంగారకావ్య మగును. '

శుక్రాశ్రమవర్ణన సుందరముగా సాగుచున్నది. దానితోనే కావ్యప్రరోచన. అచటి దివసావసానకాలము విషాదశృంగారకావ్యమువలె నున్నదట! ఇది యొక చక్కని కావ్యార్థసూచన. ఇందు గాలికెరటాల యుబుకు, తొలిచుక్క పొడుపు, ముకుళవికసనముల ప్రశంసలో దేవయాని యౌవనప్రాదుర్భావము, ప్రియదర్శనము, రాగోదయములు సూచితములు. తదుపరి పడమటిరాగము మొదలగువాని ప్రసక్తిలో ఆమె వలపుప్రొద్దు వాటారుట సూచితము. ఆమె ప్రణయపరిణామ క్రమ మది.

ఆశ్రమవర్ణన యనగా ప్రాదేశికవర్ణనములే గాక సామయికవర్ణనములును, అనగా, నచటి నదీసైకతములు, చెట్టుచేమలు, హరిణశాబకములు, కీరశారికలు మొదలైనవాని వర్ణనమే కాదు, ఆశ్రమప్రాంత మధురసాయంతనములు, ప్రభాతసమయములు, దివసావసానకాలముల వర్ణనములు గూడ చేయబడుట విశేషము. ఆవర్ణనములలో అతిశయోక్తులు లేవు. ప్రతిపదమధురము లవి. ఉదా;

శిష్యకోటీ కంఠ నిష్యంది వేదోక్తి
మృదుగాన నవసుధార్ద్రీకృతములు,
విమల వేణుమతీ పవిత్రభంగావళీ
మంగళారావ సమ్మానితములు,
ప్రతిసూన మకరంద పానకాంక్షా చర
ద్భ్రమరైకఝుంకృతి ప్రకటితములు,
సద్యస్సమాయాత సకలపక్షివ్రాత
ముఖసముద్గతగీత ముఖరితములు,

అలస మరుదంకుర స్వర విలసితములు
గోకుల ముఖోద్గతాంభార వాకులములు,
ప్రాణి హృదయ ప్రమోద సంపాదకములు
ఆశ్రమప్రాంత మధురసాయంతనములు.

ఆశ్రమవర్ణనానంతరము నాయికానాయకుల ప్రథమసమావేశమునకు ప్రాతిపదికగా, సముచితోద్దీపన విభావోపపన్నముగా వసంతోద్యానవర్ణనము లెత్తుకొనిన కవిగారి యభిజ్ఞత ప్రశంసనీయము, మరియు ప్రశంసనీయ మైనది ఆ వసంతాగమ సమున్మేషమును నాయికా యౌవనాభ్యుదయ ప్రశంసతో సమన్వయించి యెడ నెడ భావికథా సూచనా భాసురముగ చిత్రించిన కవి నేర్పు. ఉదా :

పలుకక అంతరంగమున భద్రముగా నిడుకొన్న గాటపున్
వలంపుతలంపువోలె, నెలబ్రాయపు తీయదనమ్ము గల్గు కో
ర్కులవలె, లేతనిద్దుర లెరుంగు నగమ్యసుఖంబువోలె పూ
వులు తమయంతనే విరిసిపోయిన వా సుధువాసరంబులన్.

భ్రమరు డతిథిగ నేతేర వంచన మ్మొ
నర్చు నని యెరుగని సుమనఃకుమారి
వలచి తనహృదయమ్ము సర్వ మ్మొసంగె,
నకట ! భావిజీవిత వేదనానభిజ్ఞ !

అనుభవింపని వలపు, లానని మధువులు,
ఆససేయని సొబగులు రాసివడిన
ఆ వసంతకాలపు తొలిపూవు నవ్య
యౌవనశ్రీ విలాసిని, దేవయాని.

తదుపరి 'దేవమానినివలె నొప్పు దేవయాని' వాలకము బహుభంగులుగా మనోహరముగ మన కనులకు పొడకట్టును. జలకమాడిన దేవయాని, లతాసేచనము సేయు దేవయాని, పుష్పాపచయము చేయు దేవయాని – ఈవిధముగ. అం దొక భంగి – అప్పుడే జలకమాడి వచ్చినది దేవయాని :

శ్రోణిబింబ విలంబి వేణీభరస్రస్త
　　　సుమనశ్చయ క్రియా సుందరములు,
పీనవక్షఃస్థాన మాననీయ నవీన
　　　ముక్తావళీ క్రియామోహనములు,
విమల ఫాలస్థలీ విన్యస్త కర్పూర
　　　తిలకరేఖా క్రియా సులలితములు
సౌవర్ణరుచిమత్తనూ వికాసస్నిగ్ధ
　　　పులకాంకుర క్రియా విలసితములు,
సాంధ్యవేళా కృతామల స్నానలబ్ధ
శీత వేణుమతీవారి శీకరములు
శ్రీకరములు, కల్యాణైకచిహ్న కల్ప
నాకరము లయ్యె నా యౌవనవతియందు.

ఈ శీకరముల ప్రశంసాత్మక మగు సీసపద్యములో పోహళింపబడిన ఆ మధురాక్షరములు, అక్షరములు కా, వవి కవితా సరస్వతీ కరస్థమగు అక్షసరములోని అణిపూసలు. అనఘమ సంఘటితమైన శృంగారభావసూత్రము రసికజన స్పృహణీయము. 'ప్రయత్నము లేక చిరప్రసుప్తముల్, ప్రాయపు కన్ను విప్పిన తలంపులెవో పొడసూపు' దేవయానికి ఉద్యానవనములో సుమాపచయ సమయమున ప్రియునితో ప్రథమసమాగమ మది యొక మధురఘట్టము. దేవయాని ముగ్ధసౌందర్యమునెడ కచుని హృదయము రసస్నిగ్ధ మైన ఘట్టము. 'ఉభయహస్త విలూనము, లుదయసూనములు పరస్పర సంయోగమున .... ప్రథమ యౌవన పావన ప్రణయాపూజ' ఘటించుకొన్న ఘట్టము. ఇక్కడి కిది తొలిసంజ.

మలిసంజలో తొలిపాలున మరునాడు తన స్వస్థాన ప్రస్థాన మనగా మహో త్సాహదోహల మానసుడు, మృతసంజీవనీవిద్యాపరిపూర్ణు డగు కచు డువ్విళులూరు చున్న ఆ తొలిరోజు. నాడు పూర్ణిమ. స్వర్గలోక మతని కనులకు గట్టినట్లున్నది. నాటిరాత్రియే దేవయానితో నతని చరమసమావేశము.

'శ్రీమద్గాంగతరంగ శీకరచయాశ్లేషాభిరామానిల
స్తోమాకృష్ట పరిమళప్రచుర సద్యోవిస్ఫురత్సూనముల్,
ప్రేమాలింగితకిన్నరీ మధురతంత్రీగానముల్, నందనా
రామస్థానము లప్సరోగణ విహారస్వైరతాధీనముల్. '

అని స్వర్గవర్ణన కుపక్రమించినాడు. ఉన్నటు లుండి యుడువీథికి చూపు నిగిడ్చి,

'పున్నమచందమామ సురముఖ్యుల కిచ్చు సుధాతిథేయ మీ
వెన్నెల ; పారిజాతసుమబృందము లచ్చరపిండునవ్వు లే
వన్నెల చిన్నిచుక్కలు ; నభమ్మున నిప్పుడు స్వర్గలోకపుం
జిన్నెలు తోచుచున్నవి.... '

అన్నాడు. అతనికారాత్రి ప్రకృతిరామణీయకము సర్వము స్వర్గమార్గపాథేయము గనే తోచినది. అప్పుడు దేవయాని —

'చిరుతనగవులు వెలయు నా చిన్నిమోవి
చుంబనమ్మున నమృతంబు చూరగొనవొ ?
తలపులో రహస్యమ్ముగా వలపు లీను
నట్టి నా సౌమనస్యమ్ము నరయలేవొ ?

అని ముద్దులు గునిసినది. పాప, మిక క్షణములో తన ప్రణయమునకు రానున్న ప్రళయ మెరుగని బేల ! అంత కచుడు —

' చెలియా, చిక్కని తీయతేనియలె వర్షించుంగదా నేడు నీ
పలుకుల్, నీ శుభమూర్తిలోన గల ఆ స్వర్గమ్ము సర్వమ్ము ద
వ్వులలో గాక సమీపమై యిపుడు పొల్పుంగాంచు సద్యోభవ
త్పులకశ్రీకర గాఢ తావకతనూద్యుక్తానుషంగంబునన్. '

అని అచిరభావి యగు తన స్వర్గమనమ్మును చమత్కారముగ ధ్వనింపజేసినాడు. ఆ తరువాతిపద్యమున ' అడుగంగావలయున్ మదీయనిలయంబౌ దేవతాసీమకున్ ' అని కచుడు తనవూనిక స్పష్టముచేయుటతో రవీంద్ర రూపకానువాదారంభము. ఈ కవిగారు రచించిన వైభాగ మెంతో వ్యంగ్యసౌరభము గుబాళించుచున్నది. రచన సర్వత్ర రసప్రసన్నముగ అతిమాత్రమనోజ్ఞముగ సాగినది. ఆ పద్యము లొకొక్కటి యొక రసగుళిక.

కథ ప్రసిద్ధ మైనదే కాని యిందువస్తుతత్త్వముకంటె భావతత్త్వమునకే ప్రాధాన్యము నిరూపింపబడినది. అదే కదా ప్రాచీనగాథలను కావ్యేతివృత్తములుగా గ్రహించు ప్రౌఢకవుల పరిపాటి. ఆ ప్రత్నవస్తువులనుండి యొక నూత్నభావమును పిండి సరిక్రొత్త కల్పనతో, శిల్పచమత్కృతితో ప్రపంచించి తమ యభిరుచి కనుగుణముగ నొకొక్కకతరి యొక్కొక స్వతంత్ర ప్రయోజనమును ఉద్దేశింతురు వారు. అట్టి పరిపాటి బాటించి రవీంద్రుడు, వేంకటేశ్వర కవీంద్రుడు, నిరువురును కృతకృత్యులైనారు.

ఇది ఖండకావ్యము. అనగా, మహాకావ్య లక్షణైక దేశమైన దని ఆలంకారిక మతము. ఆలంకారికులు అష్టాదశవర్ణనావిశిష్ట మైనది మహాకావ్య మనిరి. అనగా బహువర్ణనల కవకాశ మిచ్చు బృహద్వస్తుసంపన్న మైనది మహాకావ్య మనియు, వర్ణనాల్పవస్తుపరిమితి గలది ఖండకావ్య మనియు వారి యుద్దేశముగా మనము గ్రహింపవలసియుండును. ఖండకావ్యమునకు వా రిచ్చిన యుదాహరణము మేఘ సందేశము. కాని ఖండకావ్యవిషయమున అధునికదృష్టి వేరు. ఒక కథయే కా, దొకపాటి యుదంతము గాని, యొక చిన్న సన్నివేశము గాని, యొక పరిస్థితి గాని భావ ప్రధానముగా మలచబడిన కతిపయపద్యపరిమిత మగు నొక చిన్న ఖండికకును, అట్టి వివిధ భిన్నఖండికల సమాహారమునకును ఖండకావ్య మను

వ్యవహారము నేడు గలదు. ఈ యాధునికదృష్టిలో నిబద్ధేతివృత్తము, కతిపయశత వ్యపదేశాతిశాయి శ్లోకసంఖ్యాకమును నగు మేఘసందేశము ఖండకావ్యము గాక కావ్యమే యగుచున్నది. కేవలము వస్తువిస్తృతినిబట్టి కాక కవితామహత్తనుబట్టి మహాకావ్యవ్యపదేశము చేయుట నవభావుకదృష్టి. అపక్షమున మేఘసందేశము తోపాటీ సంధ్యాగీతమును మహాకావ్య మనవలసివచ్చును. కాని ఆలంకారిక దృష్టిని, ఆధునికదృష్టిని పరిశీలించి సమన్వయము చేయ ప్రయత్నించినచో మహాకావ్య ఖండకావ్యములకు సుస్పష్టముగా నొక మార్గము గోచరింపకపోదు. ప్రకృతము నేను దీనిని ఖండకావ్యమనుటకే యిచ్చగింతును. అయితే, ఒక మహాకావ్యమును వెలయించుటకు తగిన సామర్థ్యము, సాధనసంపత్తియు శ్రీ వజ్ఝల వేంకటేశ్వరకవిగారికి గల వని మాత్రము మనసార విశ్వసింతును.

ఈ సంధ్యాగీత కావ్యసంపుటములో 1933వ సంవత్సరమునుండి 1956వ సంవత్సరమువరకు వివిధపత్రికలలో కవిగా రపుడపుడు రచించి ప్రచురించిన ఖండకృతులు నొక పదునాలుగు చేర్పబడినవి. అందు హృద్యమైన వైవిధ్యము గలదు. చక్కని గేయచ్ఛందస్సులును గ్రహింపబడినవి. ఆయా రచనలకు దారి తీసిన పరిస్థితులును ప్రశస్తము లైనవి. అందనేకము అనుభవసూనృతములు. అవి కవిగారిచేతనే పేర్కొనబడినవి. వ్యాసవిస్తరభీతి వాని నిచ్చట ప్రత్యేకముగ పేర్కొని సమీక్షింపజాలకున్నాను. మన కవిగారి లేఖిని యెప్పట్టునను మధుర కవితావాహిని. ఇతి శివమ్.

వాల్తేరు
15-9-1959.

యస్వీ

# కృతి ప్రదానము

*

టాటానగరవాసి, టాటానగర్–ఫౌండ్రివర్క్స్ సెక్రిటరీ.
శ్రీ భాగవతుల విశ్వనాథం, బి. యస్సి., గారికి.

*

శ్రీ విశ్వేశ్వర వేంకటేశ్వరులు, కాశీతిర్పతిక్షేత్రరా
జావాసుల్, కృపతో నొసంగగ సమస్తైశ్వర్యభోగంబులన్,
నీవున్, నీదుకుటుంబమున్, సుఖము, శాంతిన్, గీర్తియుంబొంది యెం
తే వర్ధిల్లుము, విశ్వనాథ సుకృతీ, దివ్యద్గుణాలంకృతీ.

ఒజ్జల్, భాగవతోత్తముల్, కవివరుల్, జ్యోతిర్విదుల్, పండితుల్,
వెజ్జుల్ వశ్లాఘ్యజలవంశ భాగవతులాభిఖ్యాన్వవాయంబులం
ముజ్జీలై మనపూర్వికుల్ సకలవిద్యోద్యోగఖద్యోతులై
ఉజ్జీవింపగజేసి రిందనుక నాశోద్యద్యశోవల్లికల్.

శ్రీమంతంబగు నాంధ్రదేశమున వాసింగాంచి భాసించు నా
రామద్రావిడశాఖలోన వెలసెన్ ప్రఖ్యాతనామంబులై
మీ మా వంశము లాదినుండి కడుగూర్మిం బేర్మి శశ్వత్ప్రతి
ష్ఠా మర్యాదల జేసికొన్నవి కదా సంబంధబాంధవ్యముల్.

కన్యాదానము లాచరించి శుభసంకల్పంబు సిద్ధింపగా,
అన్యోన్యప్రియబాంధవ మ్మెసగ వియ్యంబొంది లోకంబునన్
మాన్యత్వంబు గడించినారు మన వంశస్థుల్, సుహృద్గ్రామణీ,
ధన్యత్వం బొనగూర్చుగాదె మనకున్ దత్సంప్రదాయస్థితుల్.

గుమ్మా వంశపు ముద్దుగుమ్మ తొలి నీకున్ గూర్మి యిల్లాలుగా
సమ్మోదమ్మున జెట్టవట్టి, తది మాసంబంధపున్ గోవమే
సుమ్మా, ప్రౌఢవయస్సునందు మదిమెచ్చుల్ గూర్చు నీప్రా...
గొమ్మన్ మత్కృతికన్యకామణిని గైకొమ్మా, సుహృద్గ్రామణీ.

ఒల్లంబో ననబోకుమీ, మది నదేదో శంకచే, శాసనం
బుల్లంఘించుట, నీతి గోల్పడుట యం చూహింపగాబోకుమి :
యిల్లాండ్రిద్దరి నీగతిన్ గొనుట, స్వామీ, యుక్తమే; అక్కకున్
జెల్లెల్‌వోలె మెలంగి నాతనయ నీచిత్తంబు రంజింపదే ?

గౌరీదేవికి నర్ధదేహ మిడి, గంగాదేవి మూర్ధంబుపై
గారామొప్పగ నిల్పి యేలుకొనియెన్ గైలాసనాథుండె; యెం
తేరక్తిన్ వరలక్ష్మికిన్ దగు సపత్నింగూర్చు దక్షుండవై
చేరందీయుము, విశ్వనాథ, కవితాసీమంతినీరత్నమున్.

నవ్యాలంకృతు, లర్థసంపదలు, విన్నాణంపు సౌందర్యముల్,
శ్రావ్యాలాపకలాపముల్, గతివిలాసస్నిగ్ధశృంగారముల్
అవ్యాజోజ్జ్వల వృత్తలక్షణము లాహ్లాదంబు గల్గింప మ
త్కావ్యప్రౌఢవధూటి నీ రసికచిత్తంబున్ గరంచున్ జుమీ.

స్థానీయ ప్రథితాంధ్రనాటకకళా సాహిత్యసంఘుంబు కా
ర్యానుష్ఠానములందు బాల్గొని యుపాధ్యక్షుండవై దక్షతన్
నానాటన్ ఘనసేవ జేసితి తదౌన్నత్యంబు సాధింపగా,
రాణింపన్ భవదీయకీర్తి స్థిరమై రాష్ట్రాంతరాంధ్రావళిన్.

సాటింగానని నాటకాభినయముల్, సంగీతసద్గోష్ఠు, లే
టేటన్ సంస్కృతి–సాహితీసభలు మీ రేర్పాటుగావింపగా
టాటాఅంధ్రుల బావుటా తెలుగునాటన్ మేటికీర్తిచ్ఛటల్
చాటున్ గౌరవగర్వలాంఛనముగా రాష్ట్రాంతరాంధ్రాళికిన్.

ప్రాచీనాగతబాంధవమ్ము, నటుపై రాష్ట్రాంతరావాస, మ
ర్వాచీనార్జితసఖ్యమున్ మనదు సంబంధంబు బోషింపగా
ఔచిత్యంబు దలంచి నాదు కృతి కన్యారత్నమున్ బెట్టితిన్
నీచేతన్, గ్రహియింపుమా సుకృతివై నిండారు ప్రేమంబుతో.

రూపంబున్, సరసాంతరంగము, కళాలోలత్వమున్. మంజులా
లాపంబున్, రసికత్వమున్, గుణము, శీలంబున్ మదిన్ గోర్కి బ్రే
రేపన్ నిన్వరియించు మత్కృతికుమారిన్ బ్రీతి గైకొంటి, వే
లోపం బామెకు నింక నుండ దని లోలో హర్షముం బొందుదున్.

రాగాక్రాంతము దేవయాని ప్రణయార్ద్రస్వాంతమున్ జూపు సం
ధ్యాగీత మ్మిది : నవ్యఖండకృతి సంతానమ్ము లిందున్ రస
శ్రీగర్భమ్ములు కూర్పునొందినవి : రాపిక్యంబు రాణింపగా
ప్రాగల్భ్యంబులు చూపి మోదమున నాస్వాదింపు మేతత్కృతిన్.

ఆయుష్మద్భవ దాత్మజోపనయనం బైనట్టి యీవేళనే
శ్రేయస్సిద్ధిగ నస్మదీయ కృతిపుత్రిన్ నీవు చేపట్టగా
ఆయాతాద్భుతసత్కృతాఖిలజనం బౌనౌ ననంగా నిటన్
మీ యుద్వాహము సౌట భాగ్యమని సంప్రీతిన్ వహించుతున్ మదిన్.

ఏటేటన్ నిను, మత్కుమారి గని యెంతే మోదమును బొంద మీ
టాటా వచ్చెద నేను; నట్లె దయతోడన్ నీ కుటుంబంబుతో
ఘాటీకొండలు దాటి మావసతికిన్ గష్టించి విచ్చేసి మో
మోటం బొందక మాకు సంతసము నీ వోయీ, సుహృద్గ్రామణీ.

నా జామాతకు నీకు మంగళమగున్, నా కబ్బపున్బిడ్డకున్
నీ జాయామణికిన్ సుమంగళ మగున్; మీ శుభ్రకీర్తిప్రభల్
ఆజైవాతృకతారకమ్ముగ విశాలాంధ్రావనిన్ వెల్గుతన్,
ఓజఃపూర్ణ గుణాశ్రయా, సహృదయా, ఓ విశ్వనాథాహ్వయా.

టాటానగర్,
వికారి, వైశాఖశుద్ధ దశమి
17 – 5 – 1959

వఝల వేంకటేశ్వర్లు
కృతికర్త.

# తొలిసంజ

౧

చలువనీడల లేతవలపు లీనెడు మాల-
తీ పుష్పలతల పందిళ్ళ గములు;
ఇరులలో నెత్తావి సృజియించు మేలి బం-
గరురంగు గేదంగి విరుల పొదలు;
చిరుగాలి కెరటాల పరిమళమ్ముల నూపు
తెలిమల్లెపూల మొక్కల కుదుళ్లు;
దారిప్రక్కల కలంకారమౌ పలువన్నె
వింత చేమంతిబీవియల చాళ్ళు;

వివిధ తరులతా కుంజముల్ వెలయు నొక అ-
నూన శోభానిధానమౌ కాననమ్ము,
అమరవైరుల గురువున కాశ్రమమ్ము
తనరు వేణుమతీనదీ తటమునందు.

ప్రవహించు పిల్లకాలువలలో నిరతంబు
వేణుమతీనదీ విమలవారి ;
తనరారు తీర్చిదిద్దిన ఆలవాలముల్
నానావనీజ మూలములయందు ;
పొలుపొందు ఫలభారకలస వంగిన కొమ్మ -
లకు నెత్తిడిన అవలంబనములు ;
విలసిల్లు మృదువల్లికల అల్లికలచేత ర -
మ్య వినిర్మితమ్ములైన మంటపములు ;
అలరు నాశ్రమ వనవాటి నతివిశాల
సైకతములు, సుశ్యామల శాద్వలములు,
స్ఫటిక చంద్రకాంత వితర్దికాతలములు,
ప్రతిహతాతప శీతల పాదపములు.

లేతపచ్చిక చక్కని మేత గాగ
ఆ వనమ్మున నిచ్ఛావిహారలీల,
చెదరి బెదరెడు వీక్షణశ్రీలతోడ
పరుగు లిడుచుండు హరిణశాబములు కలవు.

శ్రుతిమనోహర సుస్వర గీతులు వెలయు
వేదమంత్రముల్ పలుకుచు విచ్చలవిడి
తరుతలమ్ముల ఫలరసభరము గాని
క్రీడలం దేలు కీరశారికలు కలవు.

నిష్ఠతో నిత్యకర్మలు నెరపుకొనుచు,
శిష్యులకు శాస్త్రపాఠముల్ చెప్పుకొనుచు
శుక్ర సంజ్ఞాభిరామ రక్షోగురుండు
వాస మొనరించుచుండు నవ్వనమునందు.

కేవల బ్రహ్మచర్య వ్రతావలంబు,
లన్యచింతన విరహిత స్వాంతు, లతని
శిష్యకోటులు ప్రొద్దుపుచ్చెదరు ప్రీతి
సతత విద్యాప్రసంగ సంసక్తు లగుచు.

పరమ గురుభక్తి తత్పరత్వమున జేసి
విమలసౌదర్యసంగత ప్రేమసాధు
దృష్టి జూతురు గురుపుత్రి దేవయాని
నఖిలశిష్యులు సౌజన్య మంకురింప.

ఏకపుత్రికయై జనియించినట్టి
దేవయాని, వినూతన యౌవనవతి,
గురుని వాత్సల్యరసమున పెరుగుచుండు
నా వనమున తీవలలోని తీవ యగుచు.

శిష్యకోటీ కంఠ నిష్యంది వేదోక్తి
మృదుగాన నవసుధార్ద్రీకృతములు,
విమల వేణుమతీ పవిత్ర భంగావళీ
మంగళారావ సమన్వితములు,

ప్రతిసూన మకరంద పానకాంక్షాచర
భ్రమరైక ఝుంకృతి ప్రకటితములు,
సద్యస్సమాయాత సకలపక్షివ్రాత
ముఖ సముద్గత గీత ముఖరితములు,

అలస మరుదంకుర స్వర విలసితములు,
గోకుల ముఖోద్గతాంభార వ్యాకులములు,
ప్రాణిహృదయ ప్రమోద సంపాదకములు,
ఆశ్రమప్రాంత మధుర సాయంతనములు.

ప్రథమాగత స్నేహ రస మహావేశమా,
గాలిమొత్తపు కెరటాల యుబుకు;
వ్రీడాసమాశ్లిష్ట దృక్స్మితప్రేమమా,
మొయిలులో తొలిచుక్క ముద్దువెలుగు;
చిరహృదంతర బద్ధ నిరుపమ ప్రణయమా,
పరువంపు మొగ్గల విరియు వలపు;
విరహాతిరేక విస్ఫురితానురాగమా,
పడమటి రాగసంపదల సొగసు;

ప్రియ తిరస్కార విదళిత హృదయశోక
రసమగు, ధునీప్రవాహ తరంగ శీక
రాశ్రుసేచన: మచటి దినావసాన
కాలము విషాదశృంగార కావ్యమగును.

ఖగకుల మ్మొనరించు కలకలారావమ్ము
శిష్యపాఠములతో చెలిమి సేయ ;
తీవకన్నెల కావిమోవిపై విరినవ్వు
పూర్వదిక్ - శోభతో పొందొనర్ప ;
పిల్లతెమ్మెర పాట చల్లందనము లేటి
కెరటాల మ్రోతతో సరస మాడ ;
నీహారబిందు ముక్తాహారములు చుక్క-
సరుల మొత్తములతో వరుసగలుప ;

నిఖిల కల్యాణవైభవాన్వితము లగుచు,
నిరత లక్ష్మీనివాస భాసురము లగుచు,
పరమ సమ్మోద భావ బంధురము లగుచు
అచ్చటి ప్రభాత సమయమ్ము లలరుచుండు.

అది వసంత సమారంభ; మపుడు రుచిర
నవ్యశోభా వికాసంబునన్ దవర్చు
వనతలము తోచె; తొల్లిటి బాల్య మొదవి
యౌవనపు శోభ గొను దేవయానివోలె.

పలుకక అంతరంగమున భద్రముగా నిడుకొన్న గాటపున్
వలపుతలంపువోలె, నెలఁబాయపు తీయదనమ్ము గల్గు కో
ర్కులవలె, లేతనిద్దుర లెరుంగు నగమ్యసుఖంబువోలె పూ
వులు తమయంతచే విరిసిపోయిన వా మధువాసరంబులన్.

లతల మొలచిన అరుణ పల్లవచయంబు,
చివురు పొత్తిళ్ళలో వికసించు పూలు,
విరులు నలుదిక్కులను నింపు పరిమళములు
సంతరించిన వచట వసంతశోభ.

చిర వియోగవతీ హృదంతరమునందు
నీలిరేకపై వేదనానిబిడము లయి
సఫలమే కాని వాంఛాప్రసక్తితోడ
కలగి చెలరేగు తలపుల కలిమివోలె,

విధురహృదయకు నాశలే విరిగిపోవ,
బాహ్యసంస్కారమే కొరవడగ చిక్కు-
వడి చెదరి మాసి రేగిన నిమదకురుల
గతి విజృంభించినవి భృంగవితతు లపుడు.

భ్రమరు డతిథిగ నేతేర వంచన మ్మొ-
నర్చు నని యెరుగని సుమనఃకుమారి
వలచి తన హృదయమ్ము సర్వ మ్మొసంగె;
నకట! భావిజీవిత వేదనానభిజ్ఞ...

ఆ సనసూన సౌరభ సమావహ మందమరుత్కిశోర వీ
చీనిచయస్ఫురన్మధుర శీతలగానము ప్రేమదేవతా
హ్వానమొ, మానసీయ మదనామల కోమల నామ కీర్తన
స్వానమొ, ప్రేమిథఃప్రణయభాషణభావబహిఃప్రమాణమో.

ఆ వనవాటికాంతర సమాగత
నవ్య వసంత వేళలన్
తీవలలోననో, అలరుతేనెల
లోననో, గాలిలోననో,
తావులలోననో, చివురు
దాల్చిన రాగములోననో, నునుం
బూవులలోననో మధుర
మోహనముల్ మదనావతారముల్.

మృదులలితమ్ములౌ విరులరేకులపై చిరుగాలి నెయ్యపున్
గదలికలే పదధ్వనులుగా, వలపుం దొలిపల్కరింతగా,
నిదుర కనుంగవన్ మసకనీడల బాపిన మేలుకొల్పుగా,
మదనుడె సర్వమై వనరమాప్రియతన్ చరియించె నయ్యెడన్.

గుజ్జుమామిడి లేతచిగుళ్ళ ఆకు
జొంపములలో నెవో రహస్యంపు టిరుల
నమృత మధుర గళంబున నాలపించె
పరభృత ప్రేమవతి తొలివలపు పాట.

అవయవ వికాసములై నవయౌవనంబై
ఇడని తోడవులుగా చరియించు బాలి -
కాలలాము నూతన వనశ్రీలల్లోన
తరుణ వాసంత శోభావతార మనగ.

అనుభవింపని వలపు, లానని మధువులు,
ఆససేయని సొబగులు రాసివడిన
ఆ వసంతకాలపు తొలిపూవు, నవ్య
యౌవనశ్రీవిలాసిని, దేవయాని.

ఆమె విమలాంతరంగపు టడుగునందు
జ్ఞాతములు కాక దాగిన సకలభావ -
ములకు స్వల్పవికాసమే కలుగలేదు
అవయవ వికాసములు గల యౌవనమున.

బొమవిరుపు నేర్పు, వాడిచూపుల మెరుగుల
భావముల దిద్దు నేర్పు, కెమ్మోవి నర్థ
వంతముగ నవ్వు నేర్పు నా వయసునందు
అభ్యసింపనె లేదు బ్రాహ్మణకుమారి.

శ్రీ వసంత నితాంత శోభా వికాస
యౌవనమ్మగు నా సుమనోవనమ్ము
పావనమ్మగు నొక సుమనోవనముగ,
దేవమానినివలె నొప్పు దేవయాని.

3

ప్రాచీభాగమునం దొకానొక మధుప్రాభాతవేళన్ నవ
ప్రాచుర్యంబులు గల్గు మోవిచివురుంబ్రాయంపు రాగంబుపై
తోచెన్ నిర్మలమందహాసరచనోత్ఫుల్ల ప్రకాశంబు సా
మీచీన్యంబున నద్రిరాడ్గగనలక్ష్మీచుంబన శ్రీలలో.

పసుపుంగుంకుమ పూతపూసిన ముఖద్వారంబునన్ పల్లవ
ప్రసవాకల్పిత తోరణావళులు శోభల్ నింపగా నవ్యరా -
గ సమున్మేష మనోహరంబగుచు ప్రాక్కల్యాణగేహంబు భా
విసుఖప్రాపణ భాగ్యచిహ్నముగ దీపించెన్ ప్రభాతంబునన్.

ఉదయాదిన్ లలితాంగి యిల్వెడలి పుష్పోద్యానమార్గంబునన్
కదళీవాటిక దాటి, మేటి సికతాఖండంబులన్ దాటి వే
పదదఘ్నంబుగ జానుదఘ్నముగ నాపై శ్రోణిదఘ్నంబుగా
నది గాలూనుచు నాచరించినది స్నానంబున్ యథారీతిగన్.

అత్తరుణాంగి స్నానసమయంబున సన్ననివల్వ చక్కగా
నొత్తిన మేన తూర్పు మెరుగొందిన బంగరురంగు భాగ్యముల్,
కృత్తిముగాని సోయగపు గేదగి లోపలిరేకు వన్నియల్,
మెత్తదనంపు పెంపు విరమింపని సంపెగ సొంపు సంపదల్.

ధ్యానాధానము, ప్రాంజలీకృత కరన్యస్తాంబుధారాభవ ద్భానూద్దిష్ట వరార్ఘ్యవిన్యాసము, హృదంతర్లీనసద్భక్తిము ద్రానిద్రా ముకుళీభవన్మధుర నేత్రస్థాన, మధ్యస్తదీ క్షానుష్ఠానము మానినీ ప్రథమసంధ్యాస్నాన మూహింపగన్.

శ్రోణిబింబ విలంబి వేణీభర ప్రస్త
సుమనశ్శ్రీయ క్రియా సుందరములు,
పీన వక్షః స్థాన మానసీయ సవిః
ముక్తావళీ క్రియా మోహనములు,
విమల ఫాలస్థలీ విన్యస్త కస్తూర
తిలకరేఖా క్రియా సులలితములు,
సౌవర్ణరుచిమ త్త్వనూ వికాస స్నిగ్ధ
పులకాంకుర క్రియా విలసితములు;

సాంధ్యవేళా కృతామల స్నానలబ్ధ
శీత వేణుమతీ వారి శీకరములు,
శ్రీకరములు, కల్యాణైక చిహ్న కల్ప -
నాకరము లయ్యె నా యావనవతియందు.

కనుగవ రెప్పలందు క్షణకాలము నిల్చును, లేతమోవి పా - టున కౌగిలించు, నుద్ధతపటుస్తనసంగతి జూర్ణభావముం గాను, వళులందు జారును, కనున్ జిరసుప్తిని నాభిలో తుదిన్ నును చెలువంపు ముంగురులనుండి వడిం దిగజారు బిందువుల్.

స్నానానంతరవేళ దేహముపయిన్ జాల్వారు వార్బిందుసం
తానంబుల్ తడియార తోచె నప్డు దా తన్వంగిప్రాచీస్ఫుర
ద్భాను ప్రాథమికాంశులేశ కలనన్ ప్రాలేయశైతల్య ల
క్ష్మీనాట్యంబు తొరంగినట్టి మృదుచాంపేయమ్ము చందమ్మునన్.

కోమలశ్యామలము లైన కురులు పొత్తు
కొనిన నెయ్యమ్ము ప్రేమవాక్కులు వచింప
భుజముమీద విన్నిర్మలాంబువుల కలశ
మిడి కరమ్మున గొని వడి నడచె నామె.

కలశము కేలువద్మ్ము గొని కష్టము నెంచక వాహినీజల
మ్ములు కొని తెచ్చి వత్సలత బోసి స్వయమ్ముగ పెంచె కోర్కి చి
ప్పిలగ లతాకుమారికల; పిల్లలతల్లి కడింది ప్రేమముల్
నెలకొనియుండెనో చిరవిలీనత నామెహృదంతరంబునన్.

కమ్మని పూవులే — చెలినిగారపు
చెక్కుల జాజువారు రా
గమ్ముల సంపదల్, తను
వికాసపు బంగరు వన్నెయల్, నితం
బమ్ముల నంటు పెన్నెరుల
మాయని నైల్యము — మాతృదేవతాం
కమ్ములు తోచినట్లు లతికా
సుకుమార కుమారికావళిన్.

మృదులతా స్పర్శనమున, పరిమళాను
భవమునన్ పుష్ప మధుర చుంబనమువలన
విదిత మగు తద్వినిర్మల ప్రేమ మెల్ల
నేర్వఁగాఁబోలు మాత లా నెలతకడనె.

కమనీయ కమలినీ కల్యాణగీతంబు
నాలపించె మిళింద బాలకుండు;
తొలిపూవు జవరాలి తుదిరేయి వలపుపా-
టలు పాడె తెమ్మెర చెలిమికాఁడు;
కవితా విపంచికా నవసుధాగానంబు
గురియించె పరభృత కోమలాంగి;
ప్రకృతిశాశ్వతభావ పరమగేయము విన-
దించె వేణుమతీ నదీమతల్లి;

ప్రేమ సాఫల్య కాంక్షాప్రవృత్తిజేసి
పార్వతీదేవి పరమతపః కృశాంగి
యయిన యాగాథ గురుపుత్రి అమరవాణి
గాన మొనరించె నా సాంధ్యకాలమందు.

ఆయువతీలలామ హృదయంబున మోహనసాంధ్యరాగముల్
హాయిగ తీయుచుండఁగ ప్రయత్నము లేక చిరప్రసుప్తముల్
ప్రాయపుకన్ను విప్పిన తలంపు లెవో పొడసూపె వింతగా
తీయదనమ్ములన్ చిలుకు తేనెలయూటలుగా, క్రమమ్ముగా.

మానినీడల చక్కని తీవపొదల
చదువుకొనునో, గురుకుమారి స్వయముగానె
పోషితములైన చెట్ల కంబువులు పోసి
కొనునో, పూజాప్రసూనముల్ కోసికొనునో.

పూవులను గోయుచున్న ఆ దేవయాని
వెంటనంటుచు చెదరిన బెదరుచూపు
నీలిమమ్మలె పథ మెల్ల నింపుకొనగ
ఆడుకొనుచుండె పెంపుడు లేడిపిల్ల.

వలపుతలంపుపెంపుననో వంచినమోమున కోమలాలకా
వళి నటన మ్మొనర్ప దృఢబద్ధఘన స్తనవల్కలంబుపై
పలుచని వల్లెవాటు చెలువమ్ముగ చల్లని పిల్లగాలి లే
మొలకలకున్ నటింప గురుపుత్రిక పూవులు గోసె పూజకై.

చలువ పిసాళిగాలి ఒకసారిగ వీచినయంతలో నురః
స్థలము తొలంగిపోయినది చయ్యన పయ్యెద యంచు తా మదిన్
దలపదు దేవయాని విజనమ్మగు నవ్వనవీథి, ప్రేమశీ
తల హృదయాంచల మ్మపుడు తాకగ లేద్ధొత్రపారహాస్యముల్.

ఆ రహస్య సుమాపచయానురక్తి
దేవపూజార్థ, మితరంబు దెలియు టెట్లు?
మధురములు, నిర్మలమ్ము, లమాయికములు
యౌవనారంభ జన్య భావార్ద్ర్యములు గావె?

పూ లొకకొన్ని కోసి తలపుల్ మురలించువిధమ్ము, వీక్షణ
శ్రీలకు సామ్యముం దెలుపురీతిగ నెమ్మొగ మెత్తి చూచు నా
బాలకురంగమున్ గననివైఖరి, పోవుచు నిల్చు వాలక —
మ్మేలొకొ వింతభావ ముదయించిన దా గురుబాలనయ్యెడన్.

ఆ లలితాంగి కేయెడదయంచుల నూర్మిక వోలె నేతలం
పో లలితమ్ముగా నిశియెబో తొలిముద్దు సదృష్ట రేఖగా,
రాలనిపూల సౌరభపరంపరగా నిసి నీలిచీకటుల్
దోలిన బాలభానుని మెరుంగు కరంగిన శ్వేతచాయగా.

కాటుకపూత లేని తెలిగన్నుల చూపుల నీలిమమ్ము లా
లాటిక కోమలాలకములన్ సవరింపని వింతయందమున్
దాటెనొ, లేదొ, ముద్దుగొనె దవ్వులలో చకితమ్ముగా వనీ
నాటి ముఖంబునందు కననచ్చిన యౌవనరూపసంపదన్.

ఆ రమణీ ససంభ్రమ సమాకుల వీక్షణమాలికా ప్రభా
పూరమునన్ గనంబడియె పూరుషరూపము గొన్న దివ్యశృం
గారమొ ముగ్ధమోహనముగా, సుకుమారముగా వనీముఖ
ద్వారమునందు నయ్యుదయభాస్కరబింబము సాటిబూనుచున్.

నిలువెల్ల తనువున నలము సమ్మోహన
స్వర్లోకవాయు సంస్పర్శనంబు;
నవనవ వ్రీడానుభవము నేలకు జారు
చూపులం దిడు తొలిచుంబనంబు;

సంభ్రమాకుల భావచయము ప్రాపుపెడంగ
లీల గీలించు నాశ్లేషణమ్ము;
తలపులో తనకైన తెలియజాలక వినం
బడని ప్రేమరహస్య భాషణంబు; —
అచటనే ఆగిపోవునా, ఆ వనంబు
చేరు కోరిక కనులలో నీరవముగ
నెరుకపరచు నాతనికడ కేగనేర్చు
నా, నవయోవనరూపశాలిని, దేవయాని.

అతిథి మోమున బ్రహ్మచర్యవ్రతోప
లబ్ధ తేజమో, మదనకళా విలాస
మధుర శృంగార తేజమో మంత్రముగ్ధ
గా నొనర్చిన దా దేవయాని నపుడు.

చివురుంజొంపపు లేతచేతం లకృతాశ్లేషప్రయత్నంబుగా
సవరించెం దమయంత సంజనిత లజ్జావేగభావంబునన్
సవిలాసంబుగ తత్కపోల కలిత శ్యామాలకానీకమున్,
పవమానాంకురజాల చాలన గళద్వక్షః స్థలీ చేలమున్.

బాల హృదయాంతరంబున పాదుకొనిన
ఆ కుమారుని చూపుల కలరె, నిసుని
లేతకరముల వలపుగిల్గింత విరిసి
పోవు పరువంపు తమ్మి పూమొగ్గ పోలె.

నడకలలో మరాళగమనంబుల యేలినయా నొయ్యారమో,
బిడియమొ, ద్వారముం దెరచువేళ నిగారపు లేతచెక్కులన్
బొడమిన రాగమో, చెలువమో; ఇలపైన్ దిగిపోవు చూపులం
దుముగని భారమో, రభసమో; హృదయమ్మున నేమిభావమో.

అల తెలిగన్నుదోయి తుదలం దుదయించిన లేతనవ్వు రే
కల చెలువమ్మె నీరవముగా నెరిగించిన సల్కరింతగా,
చెలి చివురాకుసొంపు గల చేతుల రాగమె ఆదరమ్ముగా
నిలిచె కవాటపార్శ్వమున నిశ్చలతన్, నిముసమ్ము మాత్రమే.

ఆ వయస్విని పెదవుల నవతరించి
స్వాగత మొసంగు జిలిబిలి పలుకులోన
విరిసి విరియని చిరునవ్వు మెరుగులోన
తొలివలపు చిహ్నములు, ముగ్ధములు నటించె.

ఆ మధుమాసవాసర సుమాళుల కోమల సౌకుమార్యమో,
ఆ మధురస్వరంగణ సమాగత మోహన దివ్యరూపమో,
ఆ మదనావతార విభవాభ్యుదయాప్రతిమాన తేజమో
ప్రేమభరప్రధాన దృఢశృంఖల మా నవయౌవనాంగికిన్.

కార్యసాధన గాఢదీక్షారతు డగు
ఆ కుమారుని రుచిర విలోకనమున,
విహాసదాననమున, మనోవీథియందు
ఏమి భావము కలదొ ఊహింపలేము.

# తొలిసంజ

ఆ గురుపుత్రిక యెదుట త -
దాగమ కారణ కథావిధార్థంబుగ న -
భ్యాగత వదనోద్గతమై
వాగమృత రసైక మధుర వర్షము గురిసెన్.

"ఓ వయోరూపశాలినీ, దేవయాని,
సుఖము గాక దైన్యంబు చొరగలేని
స్వర్గలోకమ్ము నా నివాసమ్ము సుమ్ము;
నే గచుండ, దేవగురుండు నా గురుండు.

"ఆవాసమ్మగు నాకమున్ విడిచి, శూన్యాకాశమున్ దాటి, యం
భోవాహమ్ములు దాటి త్వత్పితృపదాంభోజాత నిర్వ్యాజసం
సేవాభాగ్యమునన్ లభించు మృతసంజీవన్యభిజ్ఞాత వి
ద్యా విజ్ఞానము కోరి చేరితి సుమీ, తన్వంగి, యీలోకమున్.

"దేవతా వాంఛనీయ విద్యావిశేష
మెరుగ వచ్చితి నిటకు, నీ గురుడు దేవ
రిపుగురుం డౌట సంగీకరించునో, ని
రాకరించునో మామక ప్రార్థనంబు."

ఆసుకుమారమూర్తి హృదయంబున నామెమనమ్ము లగ్నమై
ఆసలు చేసెనేమొ అప్పు డందగనేరని భావికాల కే
ళీ సుఖలోలలీలకు, ఫలింపగజాలని నిత్యదేవ పూ
జా సుమపాళికిన్, విజయసంపద బూనని ప్రేమవృత్తికిన్.

"నీ సుకుమారహస్తములు నీరము చెట్లకు పోసిపోసి ఆ
యాసము గొన్న వో మధురయౌవనభాగ్యవతీ, నవీనపూ
జాసుమనోవితానములు చాలఁగ కోసెద నీవసంత వ
ల్లీసముదాయమందు, మరలింపు మనుష్ణనోసంగు చూపులన్."

ఆమె కనుంగవన్ తరళమై దిగజారిన నీలినీడలన్,
కోమలమైన చెక్కిళుల, కోర్కులు రేపు గులాబిఛాయలన్
ప్రేమమె బింబితమ్ముగ, స్ఫురించె మనస్సున నాకుమారశో
భామయమూర్తికే అమృతభావమొ ఆమధురక్షణమ్మునన్.

వా రొకనిమేషమే, ఏమి భావమునన్,
నిలిచిపోయిరి లేమావి నీడక్రింద ;
మధురముగ పికాంగన ఒక్కమారె, ఏమొ,
కూసినది అల్ల లేమావి కొమ్మమీద.

ఆ కనుగోసలన్ చివురుటాకుల యెర్రదనమ్ము నిద్దురల్
సోకనిహృద్వ్యథన్ బాడము శోకదవానలమేమొ, మాధురుల్
చేకొను గొంతుహాయి సుఖశీత సుధారసమేమొ, నాటి యా
కోకిలపాట దుర్విరహఘోషమొ, ప్రేమమయాభిలాషమో.

వలపుల్ సోకని యౌవనాదిసుమనోభావంబులన్ ప్రేమపున్
తలపుల్ ఫుల్లము లైనవో, మధురసంధ్యాగీతముల్, వల్లికా
వళులందున్ సుమనఃపరీమళము లవ్వాసంతవేళన్ సము
జ్వలతన్ గ్రమ్మినలీల, నింపుగొలిపెన్ తన్వీరహోవృత్తులన్.

చక్కదనమ్మె మూర్తిగ నెసంగిన ఆ సుకుమారి జీవిత
మ్మొక్కటె పాటగా కరగెనో, వికసించిన మానసమ్మునన్
చిక్కని తీయతేనియలె చిప్పిలెనో, నిలువెల్ల నొక్కమా
రక్కడ పూవుగా విడెనొ ఆమధుమాస మధుక్షణంబునన్.

ప్రమదకర మామె జీవిత ప్రథమసంధ్య,
పాడుకొనె నాత్మలో తొలివలపుపాట ;
ఉజ్జ్వలానంద మోహన ముదయసంధ్య,
మృదుమధురము భృంగకుమారి ప్రేమగీతి.

మావులనీడలన్ గడచి, మల్లెకుదుళ్ళ గమించి, చొక్కపున్
దీవల దాటి యేగె రమణీమణి నూతన విస్ఫురన్మనో
భావభరంబుతో, కొమరుప్రాయపు మోహనమూర్తితో, నునుం
బూవులతో, కరంబు వలపుందమితో నిలయోన్ముఖంబుగా.

ఉభయహస్త విలూనము లుదయసూన -
ములు పరస్పరసంయోగమున ఘటించె
శ్రీ విమలభక్తి భావిత దేవపూజ,
ప్రథమ యౌవన పావన ప్రణయపూజ.

నాకలోకమునకు, మహీలోకమునకు,
అసురగురునకు, సురగురు నాత్మజునకు
బంధుభావంబు, గురుశిష్యభావ మపుడు
సంభవించుట యేరీతి సాధ్యపడునొ.

సుమకుమారిక నొసఁ బ్రేమచుంబనమ్ము
చివురుకెమ్మోవి నిడు, తీవచెలువమిన్న;
బంధ మెడలి స్పృశించి విభ్రాంత మొంద
నించు దా నొక్క మంచుకన్నీటిచుక్క.

నిండుజాబిల్లి గని పొంగి నింగి కెగయు,
కౌగిలింపగ కడుసార గన్న తల్లి,
ఆ మహాంభోధి గర్భవీచీమతల్లి;
తల్లిదండ్రుల వల పెంతొ సెల్లలపయి.

సారసమునకు సరసి తా ధారవోయు
నైజహృదయ రసమె; జననీజనకులు
కన్నబిడ్డల కోరికల్ మున్నె యెరిగి
మురిపెమున తీర్పజాలని ముద్దు గలదె?

తత మహానదీ విచ్ఛిన్న తటుల జేర్చు
సేతు వన, ద్యోతలమ్ముతో భూతలమ్ము
గూర్చు నింద్రచాపమ్మన గురుకుమారు
కార్యసిద్ధికి తెరు వయ్యె కవికుమారి.

# మ లి సం జ

## ౧

కచుడు:

శ్రీమద్గాంగ తరంగ శీకరచయాశ్లేషాభిరామానిల
స్తోమాకృష్ట పరీమళ ప్రచుర సద్యోవిస్ఫురత్సూనముల్,
ప్రేమాలింగిత కిన్నరీ మధుర సంతంత్రీగానముల్, నంగనా
రానుష్ఠానము లప్సరోగణ విహార స్వైరతాధీనముల్.

అట సభాభ్యంతరమున సింహాసనమున
సుఖసమాసీను డా బిడౌజుడు, తదీయ
మస్తకన్యస్త నవరత్నమయ కిరీట
రోచి నాలింగితమ్ము లాశాచయములు.

దేవయాని:

ఈ శీతాంశుని పాలవెన్నెలలయం, దీ వాలుకారేణుమా
లాశయ్యాతలమందు, నీ యలలు సల్లాపించు గీతావళీ
ప్రాశస్త్యంబులయందు, నీ పవనసౌరభ్యంబులందున్, సఖా,
ఆశల్ గల్గవా, నాకలోక సుఖభాగ్యప్రాప్తి వాటిల్లదో?

కచుడు:

ప్రాచి యదేకదే, మిసిమినన్నెల వెన్నెల దెల్లబోవు తా
రాచయ మల్లదే, అమరరాజు రథమ్ములు మబ్బు లల్లవే,
ఖేచరకామినీ విరహగీతరుతమ్ముల మార్గ మల్లదే,
ఓ చెలియా, కనుంగొనెదవో అమరావతి పొల్పు దవ్వులన్.

దేవయాని:

రమణీయమ్ములు హాసరోచిరుదయ ప్రాచీనముల్ నాదునే
త్రములన్ దోచిన నీలిచాయలకు, నిర్యన్నవ్యల జ్జావలో
క మయూఖాకర తారకమ్ములకు కాంక్షల్ సేయదో, అంతుతే
ని మరుల్ పూనదొ, నీమనమ్ము ప్రణయ స్నిగ్ధమ్ము గాదో, సఖా.

ప్రేమపాశమ్ముగా నావరించు నాదు
నీలిమబ్బుదొంతరల వేణీభరమున
నా హృదయరాజవై నీవు మోహభావ
బద్ధుడవు గావొ, యౌవన భాగ్యమూర్తి.

అమృతరసమును మించు తీయందనమున
అస్మదీయ హృదంతర మాలపించు
నలపుపాటకు తనువెల్ల పులకరింప
కరగకుందువొ నీవు, శృంగారమూర్తి.

ఇపుడు నీ మ్రోల నీ బాల వీక్షణముల
జారిపడునట్టి కోమలచ్ఛాయలందె,
లేనగవులందె, కనుగొనలేవో, సఖుడ,
స్వర్గలోక సౌభాగ్య సంపదల నెల్ల?

క చు డు:

ఈ తెలిరాతిరిన్ తళుకులే పులకించిన యీ తరంగిణీ
శీతలవారిపూరమున చెప్పగజాలని అంతరంగపున్
లోతులలోన, అల్లదె, కనుంగొనెదో ప్రతిబింబ మీను స్వః
శ్రీ తరుణప్రసన్న శుభనృత్యము, మానవతీ శిరోమణీ.

దే వ యా ని :

ఒకరి కనుదోయి నీడల నొకరి మూర్తి,
ఒకరి చెక్కిళ్ళ చాయల నొకరి యంద,
మొకరి పూవుఁబెడందలో నొకరి యెడద
ప్రతిఫలింపవె అమరశోభల, సఖుండ?

క చు డు :

పున్నమచందమామ సురముఖ్యుల కిచ్చు సుధాతిథేయ మీ
వెన్నెల; పారిజాతసుమ బృందము లచ్చరపిండు నవ్వులే
వన్నెల చిన్నిచుక్కలు; నభమ్మున నిప్పుడు స్వర్గలోకపుం
జిన్నెలు తోచుచున్నవి నిసిన్ గనుగొమ్ము, వయోవిలాసినీ.

దేవయాని:

చిరుత నగవులు వెలయు నా చిన్ని మోవి
చుంబనమ్మున నమృతంబు చూరగొనవొ?
తలపులో రహస్యమ్ముగా వలపు లీను
నట్టి నా సౌమనస్యమ్ము నరయలేవొ?

కచుడు:

చెలియా, చిక్కని తీయతేనియలె వర్షించున్గదా నేను నీ
పలుకుల్; నీ శుభమూర్తిలోన గల ఆస్వర్గమ్ము సర్వమ్ము ద
వ్వులలో గాక సమీపమై యిపుడు పొల్పుంగాంచు సద్యోభవ
త్పులకశ్రీకర గాఢ తావక తనూద్యుక్తానుషంగంబునన్.

౨

కచుడు:

అరుగంగావలయున్ మదీయ నిలయంబౌ దేవతాసీమకున్;
గురువర్యుం డగునట్టి నీ జనకు నంఘ్రుల్ గొల్చి యీనాటికిన్
బరిపూర్ణంబుగ నేర్చుకోగలిగితిన్ మద్వాంఛితంబైన దు
స్తరవిద్యన్, గురుపుత్రికా, భవదనుజ్ఞన్ వే ప్రసాదింపుమా.

దే వ యా ని :

దేవతావాంఛనీయ విద్యావిశేష
మెట్టకేలకు నీవు గ్రహించి కోర్కె
సఫల మొనరించుకొన్నావు, సఖుడ, కాని
యితర వాంఛాలవ మైన్నైన నెరుగవొకొ ?

కను నిదుర మూత లెడలించుకొనుము, నీ హృ-
దంతరాళపు టడుగున నరయు ; మచట
భగ్న మైపోవునో యను భయమువలన
ఒదిగి దాగియుండగలేదె యెదియొ కాంక్ష ?

క చు డు :

ఆసల్ లేవిక, తావకీనగురుపాదాంభోజ సంభావన
శ్రీసేవన్ గడియించుకొంటి మృతసంజీవన్యభిజ్ఞాన వాం
ఛాసాఫల్యము, జీవితాశయము: భాస్వంతుండుపూర్వాద్రిశృం
గాసీనుం డగునంత నష్టములు గావా తారకానీకముల్ ?

దే వ యా ని :

ఇంత మహత్తరంబయిన యీ ఘనవిద్య గడించి కూడ నీ
వెంత ప్రవాసఖేదము సహించినవాడవొ, అస్మదాశ్రమా
భ్యంతరవాస కష్టమున కక్కట యేగతి నోర్చినాడవో
అంతయు పూర్తిగా విదితమైనది నేడుగదా, సుహృన్మణీ.

కచుడు:

ఈ విధమ్మైన కాఠిన్య మేర్పడంగ
నీవు పల్కెద వేటికి, దేవయాని?
పెదవిపై నొక్క చిరునవ్వు విరియజేసి
సెలవొసగి యేగనిమ్ము నా నిలయమునకు.

దేవయాని:

నగవులకు నిది మీ స్వర్గనగరి కాదు:
అకట! పుష్పమ్ములోని కీటకమువోలె
హృదయమున బొంచి తినుచుండు తృష్ణ యిచట;
ప్రజ్వలితమైన కామితార్థమ్ము చుట్టు
భ్రమణ మొనరించెడిని రుద్ధవాంఛ యిచట;
తరలిపోయిన మోదమ్ము తలచి యెపుడు
బుద్ధి వెఱ్ఱియై నిట్టూర్పువుచ్చు నిచట;
సులభములు గావు నగవు లిచ్చోట, సఖుడ.

కచుడు:

తీయదనమ్ములన్ గలుగు తేనియలే కురియించినట్టి నీ
ప్రాయపు కంఠమా యిది, విలాసిని, వింతగు మార్పుతోడ నే
లా యిటు నేడు కర్కశశిలల్ వెడలించునొ? దుస్తరవ్యథన్
నీయెద నేగతిన్, ప్రణయినీ, నొగిలించితి, నానతీయుమా.

దే వ యా ని :

చలువ దేరిన నీడలవలన, తీయ
దనపు పాటలవలన మోదమ్ము నీకు
ఎంతకాలమొ యొసగిన యీ సుమవన
తలము విడనాడగా నంత సులభ మగునె ?

గళితములైన ఆసల వికారపు
రూపము గొన్న యెంతటా
కులు పలవించు మర్మరపు
ఘోషము, నీ మునిమాపు వేళ లే
వెలుగుల నీడలన్ కదలి వీచిన
గాలి విలాప ఘోషమున్
తలపవొ ? నీ వొకండవె స్మితమ్ము
వహింతువొ మమ్ము వీడుచున్ ?

క చు డు :

ఏను పునరుద్భవించితి నిచట గాన,
ప్రేమశాలిని, యీ యటవీమతల్లి
నాకు రెండవతల్లి, యెన్నటికి దీని
యెడల నాప్రేమ కృశియించ దించుకైన.

దేవయాని:

విపుల శాద్వలమ్మున తృ-
ణాహరణార్థము నీవు తోలి శ్రాం
తావయవమ్ము లుమ్మలిక
సంపగ తీవ్రతరాతప ద్వియా
మావసరమ్మునందు ప్రియ
మారగ నీకు సుఖమ్ము గూర్చు ఛా
యావరణ మ్మొసంగిన మహా
వటవృక్షము చూడు మయ్యెడన్.

కచుడు:

కాంతారేశ్వర, నానమస్కృతు లివే కైకొమ్ము; నీ నీడలో
నంతేవాసులు భృంగఝుంకరణ - పత్రాందోళనారావ సం
క్రాంతిన్ శ్రుత్యనుకూలమేళన మొసంగన్ మంత్రపాఠంబులన్
గొంతుల్ గల్పుచు వల్లెవేయునెడ నన్నున్ జ్ఞప్తియందుంచుమా.

దేవయాని:

శీఘ్రగతి గల నిర్మల జీవనమున
సంతసముతోడ ప్రవహించు అంతులేని
ప్రేమగీతి, వేణుమతీ నదీమతల్లి,
మరచిపోకుము, సఖుడ, నీ మానసమున.

క చు డు :

ఏ నిట ప్రవాసమం దున్న యింతకాల
మా స్రవంతీమతల్లి స్నేహవతి నాకు;
ఎల్లప్పుడు పాటుపడు పల్లెపిల్లవోలె
చిరుసగవుతోడ నవిరత సేవలోన
జీవనము వుచ్చి చల్లని చిన్ని పదము
పాడుకొను నామె నాస్మృతి వదలలేదు.

దే వ యా ని :

ఓ చెలికాడ, నీకు మరియొక్కతె స్నేహితురాలు, నీదు స్వః
శ్రీ చిరవిప్రయోగభవచింత, ప్రవాసపు చింత బాపగా
జూచిన భావముల్ ఫలముచూపని భాగ్యవిహీనురా లిటన్
దోచెనొ, లేదొ, నీయెదను దోచిన జ్ఞప్తిపథమ్ములోపలన్.

క చు డు :

ఆ యువతి ప్రేమమూర్తి, తదీయనామ
చింతనమ్ము మామక భావి జీవితప్ర
సూనమున ఒక్కరేకుగా, తేనెచుక్క
గా, రజఃకణముగ పొల్పుగాంచు, నబల.

దేవయాని:

ప్రాప్తనవీనయౌవనుడవై అరుదెంచుట, నీ కనుంగవన్
దీప్తములై స్మితప్రభలు నిల్చుట, ఆ తొలిచెల్మి ముచ్చటల్
సుప్తములై నశించినవొ, సోకుచునున్నవొ నీహృదంతర
జ్ఞప్తిపథమ్మునందు, చెలికాడ, వచింపుము దేవయానికిన్.

కచుడు:

మున్ను మదీయశిష్యతకు మోదమె చూపె భవద్గురుం, డసూ
యన్ నను మూడుసారులు సురారులు నాశమొనర్ప ప్రేమసం
పన్నత మీరగా నొసగె ప్రాణము నీప్రణయమ్మునన్ గదా;
ఎన్నటికిన్ కృతజ్ఞత, చెలీ, కృశియించునె నాకు నీయెడన్?

దేవయాని:

ఏమి యనెదు, కృతజ్ఞతయా? మరచెదు
గాక సర్వమ్ము, నాకు దుఃఖమ్ము రాదు.
ఉపకృతులె నీవు జ్ఞప్తియం దుంచుకొనెదొ?
సఖుడ, వల, దవి భగ్నమై సమయుగాక.

సాయంకాలమునందు నొక్కడవు విశ్రాంతిప్రలోభంబునన్
మా యారామ విరాజమాన సుమనోమార్గంబులం బోవ, నే
వో యూహల్ పచరించు నీ యెడద సద్యోవిస్ఫురన్మోదలీ
లాయుక్తిన్ బులకించెనేని అదియెల్లన్ జ్ఞప్తియం దుంచుమా.

ఓ చెలికాడ, నీ వొకడ వుండినవేళల నీసమీపమై
ఏ చరణద్వయీరవమొ, ఏ విలసద్వసనోర్మికావళీ
ప్రేంచలనాగతస్వరమొ, ఏ కరకంకణకింకిణీస్వన
మ్మో చెవి సోకనేని తలపోయుము తీరికవేళ నీదివిన్.

ఉపకృతుల మాట దవ్వుల నుండనిమ్ము
ప్రేమభావమొ, సౌందర్యమో, మరేమొ
జీవితమ్మున పూవునెత్తావివోలె
హత్తుకొనునెడ కమనీయ మదె, సఖుండ.

కచుడు :

నా హృదయమ్మునం దిపుడు నాకె యెరుంగగరానిరీతిగా
స్నేహమొ, మోహమో, బయలుసెందని వేదనయో,
మరేమొ! స
మ్మోహనలీల దోచు భరముంగొను భావము లేవో, నెచ్చెలీ,
ఊహకె కాక మాటలకు నొక్కొకవేళ గ్రహింపరానివై.

దేవయాని :

నీయెడ వీణతీగెలను నేను స్పృశించి మనోహరశ్రుతిన్
నా యనురాగమే సరియొనర్చు టెరుంగుదు నాత్మలోన; నే
మోయి సఖుండ, నన్వెదుక నొల్లకు, కీర్తి సుఖంబు నిచ్చునే!
ఈయెడ నుండిపొమ్ము, రచియింతము ప్రేమరహస్యగీతముల్.

ఏ నెరుంగుదు నోయి, నీ వీక్షణమున,
ఆననంబున, కరముల అభినయమున
ప్రతిదినము నీదు ప్రేమము పలుకుటెల్ల
ఊర్మికాంతరములనుండి ఉదధివోలె.

నా గళధ్వని కప్రయత్నముగ నొక్క-
మారుగా నంగములలోన మనసు కంప
మందు టది నే నెరుంగుదు, నస్మదాత్మ
బద్ధుడవు సుమ్ము నీవు శాశ్వతముగా నె.

కచుడు:

నాకు నావాస మగు నాకలోకమునకు
అఖిలబంధులోకమునకు నంతు లేని
దూరముల నింతకాల మెంతో శ్రమించి
నే వసించుట యిందుకా, దేవయాని?

దేవయాని:

శ్రమ కిది సత్ఫలమ్ముగ పొసంగదో? జ్ఞానమె దుర్లభంబొ, ప్రేమమె సులభంబొ, నెచ్చెలుడ! మానవలోకము కాంక్షబూని జ్ఞానమహిమ శక్తి కీర్తుల కొనర్చు కఠోరతపః ప్రకారముల్ రమణి హృదంతరంబు పరిలబ్ధముగా నొనరింప రానివో?

కచుఁడు:

దేవతలకు నీ వమృతసం
జీవని యను విద్య తెచ్చి చెప్పుదు నని, త
న్వీ, వాగ్దాన మొసంగితి,
నా విధి నెరవేర్పకుంట న్యాయం బగునే?

దేవయాని:

అది యొకటె నీకు కర్తవ్య మైన తెలుపు,
నింత కాలంబు నీ వన్యచింత లేక
పఠనమందునె గ్రంథప్రపంచ విహృతి
యందె ఏకాగ్రచిత్తుడ వైతి వేమొ?

కానుక నా కొసంగు తమకంబున కోసిన పూల మార్దవ
మ్మో, ననురాగమో; కలశముం గొని చెట్లకు నీరుపోయుచో,
ప్రాణసఖుండ, ఒత్తుకొను రాయిడి నెర్రదనంపు కెంపుపెం
పూనిన క్లేశమో, నిలిచియున్నది చూడుము నీకరంబులన్.

అమృతగళాన పాడవా, సఖా, మును నాకడ తారకాసభా
విమలమనోజ్ఞగీతములు, ప్రేమము నైజవిషణ్ణనీరవ
త్వమునను జాలిగా నొరగువైఖరి శైవలినీ తటమ్ముపై
తమసము జారువేళ, ప్రియతన్ నునుపచ్చికబీళ్ళలోపలన్.

తమకపు పారవశ్య మెడదన్, ముకుళించిన కన్నులందు నా
ట్యము లొనరించునప్పుడు రహస్యవనాంతరసీమలందు సం
భ్రమమున నన్ను గైకొని భవద్గళ మానుకొనంగ నాదు హ
స్తముల కొసంగవో, అటనెసంగవొ మామక కంకణాంకముల్?

ప్రియసఖి, నే నొకర్తు వనవీధి వసింపగ చూతునేమొ యన్
భయమున మెల్లగా వెనుకపాటున వచ్చి మదీయలోచన
ద్వయమును గొల్చునట్లిడిన తావకహస్తములందు లేజివు
ళ్ళ మెరుపుమీది నీలికళలన్ గనుచున్ తెలినవ్వ నింపవో?

నాయకుడు, నాయికయు మనమై యొసంగ
చిత్రముగ రచించిన యీ చరిత్రమునకు
ఏమి యర్థము తెలిపెదో, యేవిధమున
చెప్పెదో అన్వయము, చిరస్నేహశాలి.

మీ యమరాలయంబునసె
మెల్లగ మెత్తని లేతకుత్తుకల్
కోయగ యోజితమ్ములగు
క్రూరపు టెత్తులో, వంచనమ్ములో,
మాయలొ నీవిలాసములు?
మద్గురు శీతకటాక్ష వీక్షణ
శ్రీ యొదవించుకో
నుపకరించెనొ మామకమైత్రి, అక్కటా!

కార్యసాధన సంతోష ధుర్యుడవయి
సులభము, కృతజ్ఞతైకవచోలవమ్ము
పారవైచి పోయెదవా, సేవకున కేదొ
సరకుచేయని నాణె మొసంగినట్లు ?

క చు డు :

పర్యాలోచన లేని గర్వితమతిన్ వాకొందువా, తన్వి ? సౌం
దర్యోపాసన చేయరాని దగుచో, జ్ఞానమ్ము నార్జింప దు
ష్కార్య మ్మానెడ, సత్యసాధనము దోస మ్మేని, మన్మానసాం
తర్యుక్త ప్రణయమ్ము తప్పయిన, నింతన్ గంటి శిక్షావిధిన్.

ఏమి వచింతు నేడు, తరుణీ, సమయ మ్మిది నీకుఁ గాదు నా
ప్రేమముగూర్చి నిర్మలమొ, కృత్రిమమో యనిప్రశ్న చేయగన్;
మామక జీవితమ్మున నొనర్పగబోలు ప్రధానకార్య మా
శామతి వేచియున్నయది చాలగ నాకయి, నేను పోవలెన్.

ఓ రమణీ, వృథామతి నెదో అవకాశమె మ్రింగబోవు నే
ఆరని దుర్వ్యథా విధురతానలకీలమొ శాశ్వతమ్ముగా
తీరని ప్రేమ నామది గదింపుచు నా కికె స్వర్గసీమ కా
నేరని స్వర్గసీమ గన నే పయన మ్మొనరింపగాదగున్.

చిరకష్టానుభవోపలబ్ధ మృతసంజీవన్యభిజ్ఞాన మే
సరిగింపన్వలె దేవతావళికి, తన్వీ, నాదు సౌఖ్యంబులన్
పరిశీలింపకమున్న; ముద్వికలితాత్మ న్లేశిత త్వన్మనోం
తరబాధా ద్విగుణీకృతవ్యథుడనౌ నన్నున్ క్షమింపంగదే?

దేవయాని:

ఏమి, క్షమార్పణమ్మె? భరియింపగరాని కృధాగ్నికీలికా
స్తోమము మేలుకొల్పితివి, ధూర్తుడ, నా హృదయంబులోన! నీ
కేమి, భవత్పురంబునకు నేగి యశమ్ము గడించుకొందు, వీ
కామిని కేమి యున్న దిక కాంక్షలు జారిన జీవితమ్మునన్?

అలరు లాలయించు వలపులే అలముకొనిన
తలపు కంటకతల్పమై కలగు నేడు;
నా రహస్య లజ్జావమానములు వ్యథలు
గూర్ప జీవితమూలమ్ము గొరుకు నింక.

ప్రాయపు టెండ సోకునెడ పాంథునికై వడి వచ్చి నా వన
చ్ఛాయల నిల్చి, కాలహృతిసల్పగ పూవుల నెల్ల కోసి నీ
వీయెడ దండ యల్లితివి, యేగుచు నిప్డు తదీయసూత్ర, మ
య్యో! మొదలించి త్రెంచెదుగదోయి, సుమమ్ములు ధూళి
రాలగన్.

ఇంత విశాల మీ గగన, ఖిందె విలీనత గాంచు మన్మనో
భ్యంతర వేదనావిచలనాలపితమ్ములు గీతముల్, సమా
క్రాంత నిశీథతామసమె ప్రాణపదమ్మగు తోడునీడగా,
అంతములేని తారరుధిరాశ్రుకణమ్ములె ఊరడింపుగా.

ఆ తొలిసంజలో వెలుగులై, విరులై, చిరుగాలిమ్రోతలై
నాతలపుల్ సుఖించినవి నా యెద మీటిన తేనెపాటలో;
ఈతుదిసంజలోని యిరులే, వికృతింగొను మోడుమ్రాకులే
శీతలమృత్యుజాడ్యములె చిత్తము పాడు విషాదగీతముల్.

చిరము కష్టించి నీవు నేర్చినది యెల్ల
వ్యర్థమైపోవుగాక, కృపారహితుడ,
ప్రణయభావ మాధుర్య లవమ్మె నీదు
జీవితమునకు దూరమైపోవుగాక.

*

# సవరణ

8 వ పుటలో 10 వ పంక్తిలో ' శేకపై ' అనుటకు బదులుగా
' శేకలై ' అని చదువుకొనవలెను.

# అలరుకానుక

( 1933 – 'గృహలక్ష్మి' లో తొలిసారి ప్రచురితము. )

నీ చెలువంపుఁ జెక్కిళుల నిండిన మంజులరాగ మంచు నే,
నో చెలియా, తలంచి తమినొందుచు ముద్దిడినాఁడ; నాయెదం
దోఁచిన రాగ మంచు దయతోడఁ గనుంగొని యాదరింపుమీ
పూచిన నిండుసంపదలఁ బొల్పువహించు గులాబిపూవులన్.

నీ నునుమోవిపై నిఁ గమనీయముగాఁ దనరారు హాసలీ-
లానటనమ్ము లంచుఁ బదిలమ్ముగ ముద్దిడితిం జుమీ, కళా
హీనము, ప్రాఁతకోర్కె ఫలియింపని నాయెద యంచుఁ
దాల్పు, మో
ప్రాణసఖీ, త్వదీయచికురమ్ముల నీ తెలిమల్లెపూవులన్.

నీ హృదయాంతరాళమున నిండిన ప్రేమ యటంచు, నీ వచో
వాహిని యంచు నియ్యెడల భావనచేసెడివాఁడ, నో చిర
స్నేహవతీ, మదీక్షణవినిర్గతబాష్పకణంబు లంచు నీ
వూహయొనర్పు మీ విరుల నూరిన తీయని తేనెచుక్కలన్.

*

# వలపుటలుక

( 1933 – 'ఆంధ్రభూమి' లో తొలిసారి ప్రకటితము. ఒక సామాన్య సాంసారికానుభవము ఇందలి వస్తువు. చివరిపద్యము, ప్రియా - ప్రణయకోపోపశమనానంతరమున ప్రియుడు తమ ప్రతిబింబములను దర్పణమున చూపి ప్రియురాలితో అన్న మాటలు. )

కాటుక రేకలన్ బెళుకుఁగన్గొనలన్, దిలకమ్ము మోమునన్
నీటుగ సంతరించి రమణీయము లైన వినీల కేశముల్
పాటన సేసి సాదరి కలంకృతవై యరుదెంచి నిల్చి, నీ
వేటికి మాటిమాటికి, సఖీ, కనుగొందువు నాకనుంగవన్ ?

మృదుపాదమ్ములపై నటించు వసనోర్మిశ్రేణులన్ సర్ది పే
రెదపై జారిన పయ్యెదన్ గరములన్ శృంగార మేపారఁ దీ
ర్చెద వేలా, కరభూషణావళులు, కాంచీకింకిణీమాలికల్,
పదమంజీరము, లుజ్జ్వలద్యుతిమయ ప్రాలంబికల్ మ్రోఁగఁగన్ ?

వాలిన రెప్పలన్ మరలఁ బై కొకయించుక యెత్తి యొక్క దృ
క్జ్వాలిక నర్థవంతముగ మాటలకూరుపు లేని మంజుభా
వాల మనోహరమ్మయిన పద్యముగా విరచించి నాదు నే
త్రాల హృదంతరాళముల వ్రాసెద వేటికి ముగ్ధబాలికా.

నా వదనమ్ముఁ జూచి తెలినవ్వులు నింపెద వేల నీదు కె
మ్మోవిపయిన్, లతాంగి, నవముగ్ధముగా, ఘనమ్ములంటి సోం
పై వదులై రహించు జడయల్లిక పొందికలోనఁ గమ్మని
త్తావులు చల్లు మల్లెలు మిథఃస్ఫురణన్ ననుఁ బల్కరింపఁగన్.

నీ కనుదోయిచూపులకు, నీ చిరునవ్వులకున్ మదీయ వీ
క్షా కమనీయహాసములు కాంక్షలుచేసితి వేమొ, కాన్కగాఁ
గైకొన; యత్నపూర్వకముగాఁ గనురెప్పల, మోవి, దాటఁగా
నీ, కవి యేను డాపఁగఁ, జెలీ, వహియించితివేమొ కోపమున్.

ఏమి కతమ్మొ యల్క వహియించి గిరుక్కున నొక్కమారు నె
మ్మోమటుత్రిప్పివై చెదవు,భ్రూయుగభంగము,నవ్వులేని యా
కోమల కంపితాధరము,కొంచెము రాగముఁ బూను నేత్రముల్,
ప్రేమవతీ, యొకానొక నవీనవిలాసము నీకుఁ గూర్పఁగన్.

వంచిన నెమ్మొగమ్ము, చెలువా, పయి కెత్తవు, వాలుఁజూపు లా
కించుకయున్ మరల్పఁజన వీదెస; వ్రేళులతోడఁ గేలఁ గీ
లించిన గాజు లట్టె కదలించెదు; బొట్టనవ్రేలు నేల నా
డించెదు; క్రొత్తయందము ఘటించెదలంకృతరమ్యమూర్తికిన్.

కమ్మనిపూవులన్ వదులుగా విరచించిన నీలవేణి యం
దమ్ములదాన, నీ యధరితమ్మగు మోమిటు త్రిప్పవద్దు, నె
య్యమ్మున మీది కెత్తి నయనాంచలవీక్షల నట్లె యొక్కమా
రిమ్మెయి నిల్పి నీ కుపితవృత్తివిలాసము నాకుఁ జూపుమా.

రాగవతీ, యొకింత యపరాధ మొనర్చినవాడ నేమొ కే
ళీగతి, నీ వినోదకృతలీలకు నీదు హృదంతరంబునం
దాగని కోప మూనదగునా, కరుణన్ సమిరించి యియ్యెడన్
రాఁగదె, యొక్కమారు కనరాదె విలోలవిలోకనంబులన్.

అపరాధం బొనరించినందులకు
శిక్షార్హుం డితం డౌట నీ
విపుడున్ నీ నిశితావలోకన
శరానీకంబు వర్షించి యీ
వపువున్ దావక బాహుశృంఖలములన్
బంధించినం జాలదే?
కుపితాంగీ, యటు మోము వెట్టుకొన
నీకున్ గూడునే యిత్తరిన్?

* * *

యువతి, యాదెసఁ గనుగొను మొక్కసారి;
ఒక్క ప్రియురాలు, నొక్క ప్రియుండుఁ బ్రేమ
లీల నన్యోన్య చుంబనాశ్లేషణములఁ
బరవశత నెట్లు మోదముం బడయువారొ!

# ఆమెయేడుపు

(1933 - 'ఆంధ్రభూమి' లో మొదట వెలువడినది. భార్యా భర్తల నడుమ పరస్పర పవిత్రప్రేమగల సాంసారికజీవితమున అప్పుడప్పుడు దుఃఖకారణము లుండుట సహజము. అట్టి ప్రియురాలి మనోవేదనయే యిందలి వస్తువు.)

నిలుపుకొనంగరాక, తరుణీ, హృదయంబునఁ బొంగివచ్చు న
గ్గలమగు దుఃఖ మెట్టిటులొ కంఠములో దిగమ్రింగుకొంచు క
న్గొలుకులనుండి యశ్రువులు గూఢముగా స్రవియింపఁజేయుచున్
మలిన మొనర్చె దేమిటికి మాటికి స్నిగ్ధకపోలసీమలన్?

నాయెదపై శిర స్సునిచి నా మెడచుట్టు లతామనోజ్ఞ బా
హాయుగళంబు సేర్చి, చెలియా, నను గెంజిగురాకు వాతెరల్
పాయని వేడియూర్పులకు వాడఁగ నీ కనుదోయినుండి యే
లా, యిటు లశ్రువాఃకణములన్ వెడలించెద వేకధారగా?

ఒక్కటె ధారగా వెడలుచుండిన నీ నయనాశ్రుమాలకున్
దక్కిన నా యురమ్ము, శయనస్థలమున్, మసృణంబులైన నీ
చెక్కులుఁ జెల్వమున్ దొరఁగి సిక్తము లైనవి; యేమి కారణం
బక్కట! యీ నిశాంతరరహస్యవిషణ్ణతకున్, మనోహరీ?

నీ హృదయంబునం దెప్పుడో నీ చిననాఁట స్మరించుకొన్న యే
యూహలో నేఁటికిన్ ఫలమునొందక భగ్నములయ్యెనో, ప్రియ
స్నేహము లెల్ల నీయెడల నిర్దయ మయ్యెనో, దుఃఖబాష్పసం
దోహములన్ వెలార్చెదు కనుంగవనుండి యిదేమి, నెచ్చెలీ!

గాటపుఁజీకటిన్ జగతి కన్నులుమూసిన యీ విభావరీ
వాటికలో రహస్యమగు వైఖరి గాల్వలుగట్టు నీదు క
న్నీటికి నర్థముం దెలియనేరని నా హృదయాంతరంబు ని
ష్లేటికి రాయిడించెదు, చెలీ, తుదిఁగానని తీవ్రవేదనన్?

బిగిసిన వంతలో గళము వీడని దట్టపువేడ్పులోఁ గనుల్
మొగుడుపుఁ జెందఁగా నొడలెఱుంగని స్వాప్నికవృత్తిలో భుజా
యుగళమునన్ మదీయతను వ్రాని కవుంగిట రాపువెట్టి నా
లుగుపెదవుల్, చెలీ, క్షణములో నొకటన్ గదియించె దేటికిన్?

ప్రోవులువడ్డ యశ్రువులలోఁ బ్రతిబింబిత మైనయట్టి యీ
నీ వలవంతలోఁ, బ్రణయినీ, వలపే పులకించునో, తలం
పే విలపించునో, హృదయమే పలవించునో, భగ్నవాంఛలన్
జీవితమే కుమారిలునో చెప్పఁగఁజాలనిరీతి నక్కటా!

# వె డ లె నా మె

( 1933 - 'గృహలక్ష్మి' లో మొదట వెలువడినది. )

వెనుదిరిగి యట్టె చూచుచు వెడలె నామె,
వడిగ నను వీడి, నా దృష్టిపథము వీడి;
అశ్రుబిందు సంసిక్తము లా విలోక -
నమ్ము లంకితమ్ములు నా మనమ్మునందు.

నిన్న రాతిరి యా చెలి నీలికురుల
నలరిన గులాబి పూల రేకులు విడివడి
తద్వియోగానుగత విషాదమున వాడి
సన్నగిల్లిన వీ శూన్యశయ్యమీద.

ఆమె కోమల దరహాస, మామె నయన
మోహన విలాస, మామె మనోహరాంగ
యౌవన వికాసము కొరంతయైన యీ గృ -
హమ్ము కళఁబాసి శూన్యమై యమరు నేడు.

ఆమె యిటునటు నడయాడ నవతరించు
చీరకుచ్చెళ్ళ సడి గాని, చేతి కంక -
ణముల ధ్వని గాని, పదనూపురముల రవము
గాని వినరాదు శ్రవణభాగ్యముగ నేడు.

ఆ లతాంగి పెంచిన గులాబీలు కూడ
నావలెఁ గృశించు విరహాసంతాపకలన;
ఆమె నీలంపుఁ గురుల నెయ్యమ్ము లేక
ప్రిదులు శుష్కము లైన యీ విరులు కూడ.

ఈ విలోచనయుగళికి, నీ పెదవుల,
కీ కరమ్ముల కిపు డెదియో కొరంత;
ఆ మనోజ్ఞత కనిపింప, దా యమృతము
దొరక, దా ప్రియబంధమ్ము దూరమింక.

# తలంపులు

( 1934-'చంద్రిక' లో తొలినాఁడు వెలువడినది. వసంత ఋతువున ప్రియాదూరుఁడైన భర్త పూర్వానుభవ స్మృతు లిందు వర్ణితములు. )

నేలకు వాలికల్ గొను కనీనికలన్ స్ఫురియించు ముగ్ధల
జ్జాలలితత్వముల్, కొనల సాంద్రముగా దిగజారు బాష్పవాః
పాళుల వ్యక్తమౌ విరహభావము, లింపును సొంపు నింపు నా
లోలవినీలదృక్ప్రభలలో వలపుల్ గల మాధురుల్, సఖీ.

ఇంచుక తొట్రుపాటు ఘటియించిన కోపము, స్నిగ్ధలీల న
ర్తించిన లేతనవ్వుల స్ఫురించు ప్రసన్నత, మెల్లమెల్ల భా
షించిన నిర్మలప్రణయసిద్ధిరహస్యము, స్వీకరించి యం
దించిన చుంబనావళులఁ దృప్తియెఱుంగని కోర్కె, వెచ్చెలీ.

తిలకములేని శోభ, మరి తీరిచి దిద్దిన సొంపు, నాట్యముల్
సలిపెడి ముంగురుల్ గల విలాసము, నిద్దురలోన ముత్తియ
ములవలెఁ గ్రమ్ము ఘర్మకణముల్ గల చక్కదనమ్ము, భ్రూలతా
విలసితవిభ్రమమ్ముల నవీనమనోజ్ఞత, ప్రేమశాలినీ.

ఆ నయనమ్ము, లా పెదవు,
        లా సుకుమార విశాలఫాల, మా
యానన మస్మదీయ హృద-
        యాంతర మంతయు నాక్రమించి పూ
ర్వానుభవాంచితస్మృతు
        లనంతముగా సృజియించి యిప్పు, డ
య్యో! నను దీవ్ర వేదనల
        నొందఁగఁ జేయుఁజుమీ, మనోహరీ.

పూచిన మల్లెపూల పొలుపుల్,
        గళ మెత్తిన కోయిలల్ సుధా
సేచన మొప్పలీల విరచించిన
        గీతులు, మెల్లమెల్లనన్
వీచిన పిల్లవాయువులు
        నిండిన వీ మధువాసరంబులన్;
నీ చిరునవ్వు, నీ పలుకు,
        నీదగు నూరుపు లేవు, కోమలీ.

# సుప్తసౌందర్యము

( 1934 – 'ఆంధ్రభూమి' లో మొదట ప్రకటితము. విరహాతురు డైన ప్రియుడు నిద్రావస్థలో నున్న ప్రియురాలిని కలిసికొన్నప్పటి అతని భావము లిందు చిత్రితములు. )

హాయిగ నిద్దురింపు, మబలా, యటులే యొకకొంతసే పెవో
తీయనివౌ కలల్ గనుము, దీనులు మర్త్యులు చేరరాని స్వ
ర్గీయ పథమ్ములందు విహరింపుము, నందనవృక్షశీతల
చ్ఛాయలఁ బారిజాతసుమసౌరభ మానుచు విశ్రమింపుమా.

జవ్వని, నీదునేత్రములు సాంద్రముగా ముకుళించుఁ, గాని క్రొం
బువ్వులుపూచినట్టు లెరుపుల్ గల నీ చివురాకువా తెరల్
నవ్వులు మందమందముగ నవ్వుచు, వచ్చుచుఁ బోవునట్టి యా
మవ్వపు టూర్పుగాలులకు మంజుగతిం జలియించు నిర్మ్యోడన్.

అలసముగాఁ గనుల్ మొగుడ సంటినరెప్పల యంతరమ్మునన్
వెలువడకుండ నిద్ర శయనించుచునున్నవి, స్వప్నకేళికా
పులకితమూర్తి, నీ మధురముగ్ధ వినీల విలోకనైక శీ
తల రుచిరత్రపా విలసిత ప్రణయామృత వీచికావళుల్.

చెదరిన ముంగురుల్, తళుకుఁజెక్కుల రాగము లందగించు నీ
వదనము వాల్చుకొంటి వొకవంకకు స్నిగ్ధగళమ్ముఁ జూపి, ప
య్యెదఁ దొలఁగించుకొంటి వొకయించుక పేరుటురమ్ముఁజూపి, చ
క్కదనము లెల్ల నగ్నములుగాఁ గమనీయముగా స్ఫురింపఁగన్.

కాటుక దిద్దలేదు, తిలకమ్ము రచింపఁగలేదు, పెన్నెరుల్
పాటన సేయలేదు, సదలంకృతులన్ ధరియింపలే, దెదన్
నాటిన విప్రయోగకఠినవ్యథ నేగతి నింతకాలమున్
గాటపు వెల్గుఁజీకటులు క్రమ్మిన రాత్రుల వెళ్ళఁబుచ్చితో?

విరహకృశాంగి, నీ కలల వృత్తము లేవొ కదా: భవన్మనో
హరునకు బాహుబంధన సుఖానుభవమ్ములు కానుకవెట్టెదో,
సరసవచఃప్రసంగములు సల్పుచుఁ గోమలపల్లవారుణా
ధర పరిదత్త చుంబన సుధారసధారలు చూరలిచ్చెదో.

మూసిన నేత్రముల్ తెరవఁబోకుము, విశ్రమమొందు నంగముల్
తీసి కదల్పఁబోకు, మతిదీర్ఘముగా విడువంగఁబోకుమీ
శ్వాసము; లీనిశీథమున స్వర్గసుఖప్రదముల్, మనోహరో
ల్లాసకరంబులైన కలలం గను మింపుగ సుప్తసుందరీ.

# పలుకరింత

(రచన - 1935. బాల్యవివాహములు అమలులో నున్న కాలమది. విరహియైన గృహి పూర్వానుభవస్మృతు లిందు వర్ణితములు.)

తలఁపుమొగ్గలకు వికాసములు కలుగని
చిన్నప్రాయానఁ గ్రొంగ్రొత్త చెలిమివలనఁ
బ్రియునిరాక నెరిఁగియు నాకృతిని గానఁ
బరపకయ దాఁచుకొన్న నీ పలుకరింత;

మగఁడు మగఁ డన్న పెద్దల మాట బరువొ,
కేలఁ గేల్ పెండ్లిఁ గలిపిన లీల బలమొ,
మొదటి బిడియమ్ము నొందవించు మొలక గాఁగఁ
దొలఁగి దవ్వులఁ జన్న నీ పలుకరింత;

ఎడఁదలోపలఁ దమకమ్ముఁ గడిఁది సిగ్గుఁ
బెనఁగొనఁగ మెల్లగాఁ దల్లివెనుక డాఁగి
దూరముననుండి యించుక త్రొంగిచూచి
వదనము మరల్చుకొను నీదు పలుకరింత;

పరిణతమ్మైన తొల్లిటి పరిచయమున,
నందమొందిన వయసు క్రొత్తందనమున,
బెళుకుఁజూపులఁ, జిరునవ్వు మొలక రుచుల
వెలుఁగఁజేసినయట్టి నీ పలుకరింత;

చెలిమిబంధమ్ము, బిడియమ్ముఁ గలియువేళఁ
గనులతోఁ, బెదవులతో, మొగమ్ముతోఁ, క-
రములతో, వేణితోడ నీరవముగాఁగ
వలపు లాలికించినట్టి నీ పలుకరింత ;

చుంబన మొసంగునెడ నెమ్మొగంబుఁ ద్రిప్పి,
కౌఁగిలి యిడంగ మేను ప్రక్కకు మరల్చి,
చేయునది యెరుఁగక కన్నుఁదోయి మూసి
చెలువమునుం గుల్కినట్టి నీ పలుకరింత ;

పెదవి పెదవిని గీలించి, హృదయమునకు
హృదయము నొసంగి, ప్రేమకుఁ బ్రేమ నొసఁగి
మాటలో మాటఁ గలిపి, నిర్మల మనోజ్ఞ
లలితగళమునఁ దెలుపు నీ పలుకరింత ;

ఆ పలుకరింత లెల్ల నా యాత్మలోన
దాఁచుకొనువాడ నేఁ గాని, యో చెలియరో,
నయనయుగళికి నేల కానఁబడ వింత ?
పలుకరించిన నేఁ డేల పలుక వింత ?

# కన్నీళ్ళు

(1938 – 'గృహలక్ష్మి' లో తొలిసారి వెలువడినది. ఒక యథార్థ సంఘటన ఈ రచన కాధారము.)

బండివాఁడు కళ్ళెము లాఁగి పట్టుకొనఁగ
గుఱ్ఱపుం డెక్కలను గడల్కొనెడు రవము
టక్కుమని యాగిపోవ జట్కా యొకండు
రోడ్డుపయి వీధిగుమ్మములోన నిల్చె.

ఆ ధ్వనికి నింటిలోపలి యత్త వింత
దృష్టితోఁ గోడలిం గాంచి, "దిక్కులేని
పక్షులము, మన యింటి కెవ్వారు వత్తు,
రయిన నొకసారి కనుగొను," మంచుఁ బంపె.

ఆమె చిరకాల పతివిరహవ్యథా కృ-
శాంగి, యటువోయి యెదురుగా నరుగుదెంచు
నొక్క యౌవనోజ్జ్వల మన్మథోపమాన
మూర్తి నిజ దీన దృక్పథంబున మెరయఁగ,

భ్రాంతియై, సిగ్గుయై నన్ను వంచినట్టి
మొగము నెత్తక వెనుకదిరిగి బిరాన
లోనికిం జని, 'యది యెవ్వరో' యటంచు
ననఁగ, నత్తయు నీవలి కరుగుదెంచె.

అద్దములజోడు దగిలింప నంద మమరు
కనుల లావణ్యమయ కళాకాంతు లొలుక,
మీసములు లేని చెలువపుం బెదవివలన
భాసురమ్మగు నవమందహాస మలర,
అరవకట్టైన లుంగీయు నాపయి నొక
రీతి లాల్చీయుఁ గోటు ధరించి మేల్మి
పసిఁడిచాయల నెమ్మేని పసలతోడ
నెసఁగు యువకుండు కన్నుల కెదుటఁ దోఁచె.

ఆతనిం బోల్చుకోనలేని యామె కనుల
క్రొత్తదన మాతనికి వింత గొలుప, నప్ర -
యత్నముగ వాని హృదయంపు టడుగునుండి
అపుడు వెలువడె 'నమ్మా' యటన్న స్వరము.
సుమహితము, పవిత్రము, మనోజ్ఞము, మధురము
నా స్వరము వీవ నామె హృదంతరమున
మరపుమబ్బు దూరమ్ముగా మరలిపోయె,
వెలుఁగు జ్ఞానంపు వెన్నెల విప్పఁగనియె.

జీవకళ గ్రస్తమై రంగుచెడిన లోఁతు
కనులు, దరహాసలవ శూన్యమైన గానరాక
సారెకున్ వచ్చు వేఁడి నిశ్శ్వాసములకు
సొంపెడలి నల్లఁబడిన మీసంపుఁ బెదవి,
సంస్కరణశూన్య మగు శిరోజనిచయమ్ము,
మాసిపోయిన చిబుకమ్ము, మాటలోన,
గుండెలోన దౌర్బల్యమ్ము, గొప్పజబ్బు
రాపువెట్టిన నాఁటి నీరసపు మేను;

మదను నారోగ్యముం బొందు మనసుతోడ
మదనపల్లి సమీపమై ముదముఁ గూర్చు
నట్టి ఆరోగ్యవరమున కతఁడు చనిన
నాఁటికిని, నేఁటి కెంత యంతరముకలదు!

జీవనము నిండిపొంగిన చెలువు, లేమి
కలిమికిం దావొసంగిన పొలుపు దోఁప,
పూర్వపు టవస్థ యొక మెరపువలె మెరసె,
నాపె స్మృతిలోన, నాతని రూపులోన.

అతని 'అమ్మా' అను స్వరమ్ము, నాతఁడమ్మ
'నాయనా' యను నాపె కంఠస్వరమ్ము
చిర పరస్పర పరిచయాశ్లేష మొంద,
భాష ననువదింపఁగ రాని భావగరిమ

మూఁగవోవు గళమ్ము లిముడ్చుకొనఁగ,
వారి చూపులకున్, వారి స్వాంతములకుఁ,
దనువులకు మోఁగ మమరంగఁ, గనులలోన
నిలువక ద్రుతమ్ముగా సశ్రువులు స్రవించు.

ఉభయ నేత్ర స్రుతమ్ములై ఒక్కసారి
యేక మైన వా కన్నీళ్ళు, శ్రీకరమ్ము,
లమృతమధురమ్ము లతిపావనములు : మాతృ
సుతుల ప్రేమమ్ము వానిలోఁ బ్రతిఫలించు.

అపుడు మన్మనఃఫలకమ్మునందు నల్లె
చిత్రితమ్మగు రూపమ్ము చెరగలేదు,
చెమ్మగిల్లిన నా హృదయమ్మునందు
నా శుభాశ్రుపూరము తడియార లేదు.

# సాధన

(రచన : 1945. కొన్ని సంవత్సరములుగా కవిత విరమించు కొనిన కవి మరల కవితావ్యవసాయమునకు పూనుకొని వ్రాసిన గేయ మిది.)

ఊట లూరించితివి, వరద బారించితివి,
ఆటలాడించితివి, పాట బాడించితివి,
ఎడ తెగని గరువంపు తరగదొంతరలుగా
పరిణమించిన నీదు కవితారసముచేత
జవ్వనపు తొలిపొంగులో
పులకించు
ఎలగోరికల రంగులో —
ఆనాటి ఆ లహరి నానాటికిని ఇగిరి
నీ మొడంద ఎడారిగా మారినది యేమి?

మంచిమొక్కను నాటి యించుతమి పెంచితివి
వన్నెవన్నెల పువ్వు లెన్నొ విరియించితివి,
కమ్మతావుల దవ్వుదవ్వులకు బంచితివి,
రసికు లౌవారి మానసము లలరించితివి,
వలపుటామని తాకగా
క్రొంగ్రొత్త
తలపుగాలులు సోకగా.
రూపుచెడి, యేపుచెడి యేపగిది నా మొక్క
నేడు జడతం బూని క్రుమ్మారిన, దోయి.

కమనీయ మగు నీదు కవితావిపంచిపై
కళల అందములతో, గతుల చందములతో
ఆలపించితి వీవు మేలైన రాగాలు,
పలికించితివి నీవు పొలుపైన గీతాలు,
అమృతశీతల బిందులై
రాలంగ
వీనులకు బలు విందులై.
శిథిలమై యావీణ చెడిపోయి యీవేళ
మూలబడి యాలీల మూగవోయిన దేల ?

అవయవమ్ములనిండ ప్రవహించినది నాకు
జవముతో తరుణమైన కవోష్ణ రక్తమ్ము;
అవతరించినది నీ అణువుసం దణువుసం
దాక క్రొత్త చైతన్య, మొక క్రొత్త తేజమ్ము,
మేల్కొన్న జీవనములో
విప్పుగని
మెరుగొందు యౌవనములో.
మృత్యుభీకర శైత్యమున మంచుగడ్డయై
కొరడుబారిన దేమి నేడు నీ హృదయమ్ము ?

మరల కాంచగరాని మధురానుభూతియై,
ఒకనాటి జీవితపు సుకుమారకుసుమమై
ఆ కళాకౌశలము ప్రాణమ్ము బాసెనా,
ఆ మహోజ్జ్వలసుఖం బంతమై పోయెనా,
చిక్కువడి వ్యసనమ్ములో
మైమరచి
జీవితపు కదనమ్ములో ?
దాని మననమ్ములో తాజమహాలై నిల్చు
నానాటి కావ్యమ్ము లని తలంతువ నేడు ?

అరుణకిరణస్పర్శ యైనంత ద్రవియించి
గడ్డకట్టిన మంచు కదలి ప్రవహించదా?
అల వసంతపు తెమ్మెరల కౌగిలింతలకు
మొద్దుబారిన మోడు మరల చివురింపదా?
శక్తి నీయది జీర్ణమై
పోలేదు,
దాగియున్నది పూర్ణమై.
పెద్ద నిద్దుర కప్పు విదలించి, తొలగించి
మేలుకొల్పుము వేగ నీలోని ఆశక్తి.

నిర్జీవముగ తోచు నిఖిలవస్తువులందు
అవ్యక్తమగు దివ్యశక్తి నివసించు, నది
బయలౌను దనుకూలమగు పరిస్థితులందు;
ఘర్షణమ్మున పుట్టు ఘనమైన విద్యుత్తు;
ఇందనుక నెద సుప్తమై
నీశక్తి
పడియుండినది గుప్తమై.
వేయివెలుగుల దాని వెలికి తీయుము నేడు,
వలయు నీ సాధనకు, నీ కళారాధనకు.

# నవ్యసృష్టి

(1945 – 'ఆంధ్రశిల్పి' లో తొలిసారి వెలువడినది. కొన్ని సంవత్సరములుగా కవిత విరమించుకొనిన కవి మరల కావ్య రచనకు పూనుకొని వ్రాసిన గేయ మిది. 'అమరవీణా' కావ్యసృష్టి కిది ఉపక్రమణిక.)

వలదు వల దిక కాలహరణము,
సలుపదగు మంగళాచరణము;
వలయు పరికరముల గ్రహింపుము,
అచలమగు దీక్షను వహింపుము;
నవ్యసృష్టిని చేయవలె, నోయీ,
క్రొత్తరీతుల
నవ్యగీతుల వ్రాయవలె, నోయీ.

ప్రాతపదములె అయిన నేమీ,
చేతగాదా క్రొత్త కూరుపు?
చూపలేవా క్రొత్త రూపము
సంతరించెడి నీదు నేరుపు?
దివ్యదృష్టిని జగము కన్గొనుమా,
కావ్యముల నిక
నవ్యసృష్టిని జేయ దొరకొనుమా.

పూర్వకృతు లను పునాదులపై
పూని కట్టుము నూత్న సౌధము,
నవ్యశోభా లక్షణాన్విత
వైజయంతీ శ్రీ సనాథము;
శిల్పకౌశలమునకు సాక్ష్యముగన్,
ఉత్తమంబగు
కల్పనాపరిణతికి లక్ష్యముగన్.

ప్రాతగిల్లిన యీ జగమ్మున
నూతనత్వము కలదు నిత్యము,
ఆ రహస్యము యుష్మ దాంతర
దృష్టిగోచర మగుట సత్యము;
విశ్వమర్మ మెరింగి ఉరుశక్తిన్
విస్తరింపుము
నిశ్వసించిన నీదు మహితోక్తిన్.

ఏడు స్వరముల మేళనమ్మున,
ఏడు రంగుల మిశ్రణమ్మున,
నవ్యరాగము, నవ్యచిత్రము
నుప్పతిలుఁ గరనైపుణమ్మున;
నవ్యకవితాపథము గను, మోయీ,
లెమ్ము లెమ్మిక,
నవ్యసృష్టికి బూనుకొను, మోయీ.

# పూలమొక్క

( 1947 – 'ప్రవాసి' లో మొదట ప్రచురితము. రాష్ట్రాంతరవాసములో కవితాకృషికి దోహదము లేని దురవస్థలో దురపిల్లిన కవి వేదనయే యీ గేయము. )

ఏనాడో నాటాను నే నొక్క పూమొక్క
రంగారి మెరసేటి బంగారు నేలలో;
వేశాను ఎరువులను, చేశాను దోహదము;
తోచినవి
వెలుగురేకల మాలికల్,
వీచినవి
ఎలదెమ్మెరల వీచికల్.

పెరిగినది ఆమొక్క పెంపుగా, సొంపుగా,
క్రొంజిగురు మోటికల సంజకెంజిగులతో,
చూచేటి మానవుల చూపులకు నింపుగా;
పూచినవి
మంచిపువ్వుల దొంతరల్,
కాచినవి
రుచిర ఫలముల మొత్తముల్.

దాని అందము చూచి, దాని చందము చూ
మురిసి మానవు లెల్ల ముగ్ధులై పోయారు,
వేనోళ్ళ దాని నెంతే నుగ్గడించారు ;
కొన్నారు
విరుల వాసన తృప్తిగా,
తిన్నారు
మధురఫలములు విందుగా.
వేళ్ళతో నా మొక్క పెకలించివేశాను,
దూరాన వేరొక్క దేశాన పాతాను,
సారమే కరవైన గొడ్డుపోయిన చోట.
పీడగా
కొట్టినవి చెడు వాయువుల్,
చీడగా
పట్టినవి క్రిమిజాలముల్.
నానాటి కా మొక్క క్షీణించిపోయింది,
దాని అందము క్రమముగా నంతరించింది,
కాయలే, పూవులే మాయమైపోయాయి.
ఈనాడు
చావుబ్రతుకుల సంధ్యలో
ఆ మోడు
వెతలొందు నేకతముగా.

# ఫిడేలు నాయుడు

(రచన — 1956. విజయనగరమున కొన్ని సంవత్సరములు విద్యాభ్యాస మొనర్చిన కవి బహువారములు నాయుడుగారి సంగీతము విని పొందిన ఆనందమే యీ రచనకు కారణము.)

శ్రీకరాంధ్ర మహీ పురంధ్రీ
మకుట మణి భూషాయమానము,
భారతీ దేవీ విహారో —
ద్యాన వనసీమ;

సకలవిద్యాభోజుడై శ్రీ
రాయలై ఆనందగజపతి
కట్టి నిలిపిన కళాశాలల
దక్షిణపు కాశి;

తెలుగుతల్లికి క్రొన్నగలు, ము —
త్యాల సరముల పూల సరములు
సంతరించిన సత్కవితా —
వల్లరికి పాదు;

బిరుదు లేని కళాప్రపూర్ణుడు,
గానవిద్యాచార్యుడు, హారిక -
థా పితామహాలు డాడిపాడిన
కళామందిరము;

'దివిజ గంగా భవానీ, యిట
మాని కదలు,' మటంచు పలికిన
సూరి అడిదమువారి బిడ్డని
శూరతకు సెలవు;

మేటివిద్యల విజయనగరము
మేలి బంగరుగడ్డ కడుపున
పుట్టి కీర్తిపతాక నెత్తిన
ముద్దు బిడ్డండు.

అమరలోకమునుండి ధాత్రికి
అవతరించిన కళానాథుడు,
ఫిడేల్ నాయుడు, లోకవిశ్రుత
జంత్రశాసనుడు.

వాని వాదన కళా మాధురి
మర్త్యదుఃఖాతీత దివ్యా -
నంద రమ్య స్వర్గమునకు అ -
నర్గళద్వారం.

చిత్రకారుల చేత లే దా
శిల్పసౌందర్య ప్రభావము,
కవుల పలుకుల గానరా దా
కల్పనాశక్తి.

అసాధారణ శిల్పనైపుణి
కాస్పద మ్మగు నా కళాప్రియు
సిద్ధహస్తములోన కల దొక
సృష్టివై చిత్రి;

కలదు గిరితట చటుల నిర్ఝర
విమలజల కలకలనినాదం,
ప్రబల ఝంఝూ క్షుభిత సాగర
భీషణధ్వానం;

కలదు సఖ నెడబాసి కుందెడి
కోకిల కుహూకుహూ విషాదం,
చక్రవాక మొనర్చు కువకువ
లోని ఉత్కంఠ;

కలదు యమునాతట వనాంతర
రాధికాప్రియ రాసనృత్యము,
కలదు హిమవన్నగ మహానట
విలయతాండవము.

అభ్ర-చుంబి తుసారభూధర
శుభ్ర మకుట మరీచికలలో,
అగ్ర - కన్యాకుమారీ తట
వీచికలలోన,

ఆటలాడిన ఆ కళానిధి
యశఃకాంతులు మాతృదేశము
నధిగమించి దిశాతటమ్ముల
నాక్రమించినవి.

భారతీయ కళాప్రశస్తికి
వన్నె దెచ్చిన మేటివీరులఁ
గన్నతల్లివి, ధన్యురాలవు
మా తెలుగుతల్లీ.

# హీరాకుద్-సేతువు

రచన – 1956. ఒరిస్సాలో మహానదిపై నిర్మించబడిన యీ సేతువును కవి సందర్శించిన తరువాత వ్రాయబడిన దిది. ఒరియాభాషలో 'హీరాకుద్' అనగా రత్నరాశి అని అర్థము. ఒకప్పు డా స్థలమున రత్నములు దొరకెడివట!)

అదిరా! అద్భుతకల్పన – ఇది మహానదీసేతువు,
అభినవ మానవ విభవాభ్యుదయ కౌముదీ హేతువు;
మానవ విజ్ఞానశిల్ప నైపుణీ ప్రమాణ మ్మిది
ప్రకృతి మహావిజయ లాంఛనం.

కర్కశతర వికృత విషమ నగ్నశిలా కంకాళము,
జీర్ణ శీర్ణ హృదయ శుష్క జీవన సంకట నాళము;
కానరాని గర్భములో మును దాగిన యీ దృశ్యము
అవురా! ఎంత భయానకమో.

ఆకట మలమల మాడిన డొక్కల కంటిన వెన్నులు,
గోతులవలె పుర్రెలలో లోతుకు పోయిన కన్నులు;
కూటికి గుడ్డకు నోచని కోటిశల్యపంజరములు
గోచరించు నీ రూపములో.

నీల నభోమండల నిర్మల శోభా భండారము,
సేతుబంధ పరిరక్షిత జీవన సంపత్పూరము,
ఈ నూతన కాసార మనూనశక్తినిక్షేపము
ఓహో ! ఎంత మనోహరమో.

కార్మికుల నిరంతరఘన ఘర్మవారి ధారలతో,
శ్రమజీవుల ధమనీస్రుత రక్తనిర్ఝరమ్ములతో
నిండిన దీ నవభారతజాతి జీవనాధారము,
మహానదీ పయస్సాగరం.

జమిలిసరుల గట్టిన చెంగలువ పూల దండవోలె,
మింట మెరయు నింద్రచాపఖండమ్ముల జంటవోలె
లోహితవర్ణ విరాజిత లోహమయ కవాటరాజి
సాగరమున ప్రతిబింబించున్.

ప్రతిదినావసాన మ్మొక ఉజ్వల పర్వోదయముగ
అతిశయకాంతుల వెలుంగు నీ యఖండదీపావళి,
హీరాకుద్ - సరసి ఉరస్సీమ కలంకారముగా
రూపొందిన వజ్రహారమై.

ప్రాకృతిక నికుంజ తరులతాకీర్ణము లీ దీవులు
ఈ మహాసరోవర మధురామల సలిలమ్ములలో
భాసిల్లునో భావిలోన నవమానవ పరికల్పిత
కల్పకవన కల్ప వనములై !

జనతా కోలాహలసంకుల మొకనా డీ గ్రామము,
దినదిన పూజా భాజన మొకనా డీ మందిరమ్ము;
నేడు పరిత్యక్తములై సిదుకించును భగ్నములై,
సాగరజల దరమగ్నములై.

స్వర్గసీమలోని సుఖమయానుభవ పరంపరలే,
భారత భావి సముజ్జ్వల భాగ్యరత్న సంపదలే,
ఫలియించిన స్వప్నములే ప్రతిఫలించు నిపు డోహో!
ఈ మధురార్ణవ గర్భములో.

ఈ యజ్ఞములో ప్రాణము లర్పించిన త్యాగధనుల
ఘనకీర్తి శిలాంకురముగ నిలిచిన యీ పాలరాతి
కంబము గని ఒక్కసారి యే కన్నులు చెమ్మగిల్ల,
వే గుండెలు కరగిపారవు?

రత్నరాశి కాస్పద మీ పద మట, 'హీరాకు' ద్దట!
జలసేచన వర్ధిత కృషిసంపదలకు, జలవిద్యు
త్పరిచాలిత యంత్రశిల్ప భాగ్యములకు కారణ మీ
నిర్మాణము సార్థకనామం.

లోకశోకవారణ మీ హీరాకుద్ – సేతు వనగ
శోభిలు నీ వసతిగృహ 'మశోకనివా' సాఖ్య మ్మయి,
మహానదీ దక్షిణతీరాంచల శైలాగ్రమ్మున
శారద చంద్ర ప్రకాశమై.

ప్రకృతి మహాశక్తులపయి ప్రబలప్రభావమ్ము చూపి
విజ్ఞానయుగమ్ములోన మానవుండు సాధించిన
విజయమునకు చిహ్నముగా వినువీధిని తాకి యిచట
విలసిల్లును జవహర్ — మీనార్.

అదిరా! అద్భుతకల్పన — యిది మహానదీసేతువు,
అభినవ మానవ విభవాభ్యుదయకౌముదీ హేతువు,
మానవ విజ్ఞానశిల్ప నైపుణీ ప్రమాణ మ్మిది
ప్రకృతి మహావిజయ లాంఛనం.

# మధుస్వప్నము

(రచన - 1956. ఆంధ్రావనికి, ఆంధ్రజాతికి దవ్వులలో జీవితము కడపుచున్న ప్రవాసాంధ్రకవి ఉగాదినాడు పొందిన ఆవేదన, ఆశ ఈరచనలో వ్యక్తములు.)

పచ్చపొలాలలో మిసిమిబంగరుచాయల మేలిచేలలో,
చల్లని పిల్లతెమ్మెరలు సాగిన లేగెరటాలమాలలో,
వెల్లువలైన అందముల వేయితెరంగుల వింతలీలలో
ఉల్లము పల్లవింప గననోపనొ, పంటవలంతి నృత్యముల్.

పండితకోటిలో, సుకవిభావుక మంజులకావ్యవాటిలో,
నిండిన కమ్మతేనెల జనించినఊటల నింగియేటిలో,
పండువు లోనికన్నులకు వాటిలునట్టులు హద్దుదాటి ఎ
న్నండిక కాంతునో కయితనట్టువకత్తె కళావిలాసముల్.

దివ్యకళా తపోధనులు తీరిచిదిద్దిన తెల్గుతోటలో,
నవ్యత లీను పూలతలునాటినచోటుల రాచబాటలో,
కావ్యరసస్రవంతికల గానసభల్ నెలకొన్న కోటలో
శ్రవ్యము, దృశ్యమున్ వలచి స్వైరవిహార మొనర్పఁగోరెదన్.

పూర్వచరిత్రలో తెలుగుపువ్వులు పూచిన తెల్గునేలలో,
పర్వపుటాదినై కదియవచ్చిన మేటి ఉగాదివేళలో
పర్విడి కన్నతల్లి యొడి బడ్డ అనుంగు తెనుంగుబిడ్డనై
కర్వును తీర్చుకోని యెద గాటపుగోరికలోన మూల్గుదున్.

అన్నల తమ్ములన్ గలిసి అక్కలతో చెలియండ్రతో స
ఖిన్నమనస్సులో అణగి కీడ్నషు పిన్నవయస్సు ముచ్చటల్
తిన్నని తీరు నెయ్యముల తియ్యదనమ్ముల జేరి పల్కగా
ఎన్నటికిన్ ఫలించునో మదీయహృదంతర కల్పనాలతల్.

దవ్వులలో కళాచ్యుతికి తావగు నాగరిక ప్రవాసపున్
సవ్వడి తెర్వులో బ్రతుకుసందడి కవ్వపురాయిడింపులో
పువ్వులు గుత్తులై విరియ, పొత్తుగ నవ్వులు వెన్నపూసలై
రివ్వున చిమ్మగా, పులకరింతును, కాంతును తియ్యనౌ కల

వింత ఉగాదిపండుగల వేడ్కలలో హృదయారవింద వా
సంతిక వాసనారుచి రసప్రసరమ్ములతో, ప్రఫుల్లతా
కాంతులతో ప్రవాసకవి గాయపు పూవు వెడంద భావము
గొంతులవిప్పుతో చదువుకొందురు సోదరసోదరీమణుల్.

*

సమాప్తము

# వేంకటేశ్వర కృతులు

౧. అమరవీణ. ఆధునిక గేయకావ్యములలో అత్యున్నతస్థాయి నందుకొని ఆంధ్రప్రభుత్వబహుమతి నంది బహుముఖముల ప్రశంసించబడినది.
170 పుటలు. వెల రూ. 2–00

'.... నే నీకావ్యమును పలుసార్లు చదివినను తనివితీరలేదు. మరియొక సారి చదువవలె నన్న బుద్ధి పుట్టుచునే యున్నది. చదివినకొలదిని చవు లూరుచుండుటయే అందుకు కారణము.'

— గి. వెం. సీతాపతి

.... ఈ అమరవీణ. ఆ సరస్వతీపురస్కారపుణ్యఫలము లగు తీర్థ ప్రసాదములు సంగీతసాహిత్యములు రెండును సమపాళముగా కలిసివచ్చిన మధురకావ్యరాజ మది.'

— యస్వీ జోగారావు

'.... రుచిప్రియుని వీణాగానంలోని ప్రవాహశక్తి, మాధురి నృత్యం లోని సద్యఃగమనం ఈగేయాలలో పరవళ్లుత్రొక్కినవి .... నూతన ప్రయోగంలో గ్రంథాన్ని ఆసాంతం ఇంతటి ఝరీవేగంతో నడపగలగటం అభినందించదగిన విషయం.'

— ఆంధ్రప్రభ

'.... లక్షణశోభితమైన కవిత్వాన్ని చదివితే మనస్సు చెమ్మగిల్లుతుంది, హృదయం వికసిస్తుంది, బుద్ధి పరిమళిస్తుంది. ఈ అమరవీణ చదివేక ఇవి కలగడమే కాకుండా కావ్య మైపోయిన యెంతో సేపటివరకూ గుటక లేస్తే వేసిన గుటకల్లా మధురమధురంగా గులకరించింది.'

— ఆంధ్రపత్రిక

'.... అమరవీణ అత్యద్భుతవిజయం. గేయపద్ధతిలో విరచించబడిన సంపూర్ణకావ్యా లన్నింటా మిన్నగా నున్నది.'

— సోమసుందర్

౨. నౌకాభంగము. పద్యకావ్యము. బి. ఏ., ఇంటరు పరీక్షలకు పఠనీ
యము. 100 పుటలు వెల రూ. 1–75

౩. నౌకాభంగ. ఉత్కళ పద్యకావ్యము. 90 పుటలు. వెల రూ. 1–50

౪. సంధ్యాగీతము. కచదేవయానుల ప్రణయ పరిణామము చిత్రించు పద్య
కావ్యము. ఇతరఖండకృతులును కలవు. 100 పుటలు. వెల రూ. 1-75

౫. మాతృవందనము. 3000 పాదములు గల స్వతంత్ర పద్యమాలికా
కావ్యము, త్వరలో వెలువడగలదు.

౬. నీరాజనము. ఖండకావ్యసంపుటి. అముద్రితము.

౭. ఆంధ్రవ్యాకరణసంస్కరణము. తెలుగు వ్యాకరణముల లోటుపాట్లను
విమర్శించి తెలుగు భాషాతత్త్వమును తేటపరచు పరిశోధనాత్మక – వ్యాస
సంచయము. అముద్రితము.

౮. క్రొత్త తెలుగు వ్యాకరణము. ఆధునికపద్ధతుల ననుసరించి వ్రాయ
బడిన విపులమైన అపూర్వవ్యాకరణము, రచనలో నున్నది.

ప్రతులకు :

వజ్ఝల వేంకటేశ్వర్లు, బి. ఏ., బి. యిడి.,
భూపతి వీధి,
జయపురం, కొరాపుట్ జిల్లా, ఒరిస్సా.